సాహిత్య

# ప్రస్థానం

జూన్ 2013

వెల రూ. 10



సాహితీ స్రవంతి



# సుందరయ్య శతజయంతి జనకవనం

మే 19, సుందరయ్య విజ్ఞానకేంద్రం, హైదరాబాద్



సుందరయ్య శతజయంతి ముగింపు ఉత్సవాల్లో భాగంగా సాహితీస్రవంతి, సుందరయ్య విజ్ఞానకేంద్రం సంయుక్తంగా నిర్వహించిన జనకవన దృశ్యాలు. ప్రారంభోపన్యాసం చేస్తున్న కె. శివారెడ్డి, సమన్వయ కర్త తెలకపల్లి రవి, అతిథి సందేశాలు ఇస్తున్న అంపశయ్య నవీన్, నిఖిలేశ్వర్, దేవేంద్ర, సుధామ, ద్వానా శాస్త్రి, కవి యాకూబ్



అద్దేపల్లి రామమోహనరావు రచించిన 'కాలం మీద సంతకం' కవితా సంపుటిని ఆవిష్కరిస్తున్న అంపశయ్య నవీన్

కె. ఆనందాచారి దీర్ఘ కవిత 'స్ఫూర్తిశిఖరం' ఆవిష్కరిస్తున్న తెలకపల్లి రవి.



శిరంసెట్టి కాంతారావు రచించిన 'ఆకుపచ్చని విధ్వంసం' నవలను ఆవిష్కరిస్తున్న మండవ సుబ్బారావు

బొమ్మరాత యల్లయ్య రచించిన 'నెమలీకలు' నానోల సంపుటి ఆవిష్కరిస్తున్న అద్దేపల్లి రామమోహనరావు



'ఆకుపచ్చని విధ్వంసం' నవలపై మాట్లాడుతున్న ముక్తవరం పార్థసారథి



'కాలం మీద సంతకం' కవిత్వంపై మాట్లాడుతున్న మేడిపల్లి రవికుమార్



'స్ఫూర్తిశిఖరం' దీర్ఘకవితపై మాట్లాడుతున్న సీతారాం



శ్రీశ్రీ చిత్రాలు, కవితలతో రూపొందించిన క్యాలెండర్‌ను అద్దేపల్లికి అందజేస్తున్న పరుచూరి హనుమంతరావు

PRSUM02A150

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 12 జూన్ 2013 సంచిక : 6

# సుందరయ్య శతజయంతి జనకవనం

సుందరయ్య శతజయంతి ముగింపు ఉత్సవాల్లో భాగంగా హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో నిర్వహించిన సుందరయ్య శతజయంతి జనకవనానికి వచ్చిన స్పందన చాలా సంతోషం కలిగించింది. ఆదర్శనేత పుచ్చలపల్లి సుందరయ్య జీవితాంతం సామాజిక మార్పుకోసం కృషిచేశారు. నిరాడంబరతకు నిలువెత్తు నిదర్శనంగా జీవించారు. సామాజికంగానూ, వ్యక్తిగతంగానూ ఆదర్శనీయమైన విలువలను ప్రవేశపెట్టారు. ఆయన జీవితం ఆద్యంతం స్ఫూర్తిదాయకం. ఏ విధంగా చూసినా ఈ రోజున సమాజంలో కనీస మానవ విలువలు అడుగంటిపోవడం కనిపిస్తుంది. దళితులపై, మహిళలపై దాడులు, అత్యాచారాలు వర్తమాన సామాజిక స్థితిని కళ్ళకు కడుతున్నాయి. ఇక రాజకీయ, కార్పోరేట్ అవినీతి తారాస్థాయికి చేరింది. ఈ పరిస్థితుల నేపథ్యంలో సుందరయ్య వంటి నేతలను స్మరించుకోవడం, తెలుసుకోవడం, స్ఫూర్తి పొందడం ఎంతైనా అవసరం. సాహిత్యరంగంలో ప్రజా రచయితల పట్ల సుందరయ్య ప్రత్యేక శ్రద్ధ కనబరచేవారు. సాంస్కృతిక రంగం ప్రాధాన్యతను వివరిస్తూ పలు వ్యాసాలు రాశారు. ఆయన శతజయంతి ముగింపు ఉత్సవంగా శతజయంతి జనకవనం కార్యక్రమాన్ని సాహితీస్రవంతి, సుందరయ్య విజ్ఞానకేంద్రం సంయుక్తంగా నిర్వహించాయి. అనేకమంది కవులు, రచయితలు పాల్గొని కార్యక్రమాన్ని విజయవంతం చేశారు. ఈ ఉత్సాహం ముందు ముందు మరిన్ని కార్యక్రమాలకు ప్రేరణనిస్తుంది. ఈ కార్యక్రమంలో పాలుపంచుకున్న అందరికీ ధన్యవాదాలు.

◆◆◆

ఎండదెబ్బ గతంలో ఎన్నడూ లేని స్థాయిలో మృత్యుతాపంగా పరిణమించడం ఆందోళన కలిగిస్తుంది. ప్రతి జిల్లాలో రోజూ డజన్ల మంది పిట్టల్లా రాలిపోతున్న దృశ్యం మనసు కలిచి వేస్తుంది. 50 డిగ్రీల సెల్సియస్‌ను తాకిన గ్రీష్మతాపం ప్రకృతిలో తిష్టవేసిన అసమతుల్యతకు అద్దం పడుతుంది. రెక్కాడితే గాని డొక్కాడని శ్రామికులు, నిరాశ్రయులూ, నిర్భాగ్యులూ అధికంగా బలవుతున్నారు. వారికి కనీస అచ్ఛాదన, పని పరిస్థితులు కల్పించకపోవడం వల్లనే ఇంతటి ప్రాణనష్టం జరిగింది. వడదెబ్బ అనేది మహా ప్రమాదంగా మారి ఇన్నిన్ని ప్రాణాలు హరిస్తున్నా దాని గురించి విస్తృత చైతన్యం కలిగించేందుకు, తక్షణ చికిత్స అందించేందుకు ప్రభుత్వం ఎలాంటి ప్రత్యేక ఏర్పాట్లు చేసింది లేదు. అత్యవసర పరిస్థితిగా పరిగణించి ప్రభుత్వం తగు చర్యలు చేపట్టాలి. వడదెబ్బ బారిన పడి మృతిచెందిన వారికి మా ప్రగాఢ సంతాపం తెలియజేస్తున్నాం.

◆◆◆

కవి, రచయిత కలేకూరి ప్రసాద్, కథా రచయిత త్రిపుర ల మృతికి సంతాపం ప్రకటిస్తున్నాం. ప్రతిభావంతమైన రచనలు చేసిన కలేకూరి ప్రసాద్ పలు అనువాద రచనలు కూడా చేశారు. కథా రచయిత త్రిపుర భిన్నమైన శైలిలో కథలు రాసి ప్రాచుర్యం పొందారు. తెలుగు సాహిత్య వేదికపై వీరిరువురూ తమ ప్రత్యేకతలు చాటుకున్నారు. వీరికి జోహార్లర్పిస్తున్నాం.

బొమ్మలు : తుంబలి శివాజి, వెంకటేష్, భాస్కర్, రమేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# గొంతెండి పోతుంది!



బాలసుధాకర్ మౌళి
9676493680

మిట్ట మధ్యాహ్నం
సూరీడు నెత్తిమీద కొచ్చాడు

ఊరి చివరన కళ్లంలో 'అసిరయ్య...' పాకలో నుంచి ఆవులను బయటకు తోలుకొచ్చి ...చెట్ల కిందన పాతిన కొయ్యలకు కన్నెలతో కట్టాడు.

రెండు చేతులతో పచ్చగడ్డిని తీసుకొచ్చి .... ఒక్కో ఆవు ముందూ పడేసాడు.

ఆకలితో ఆవురావురమంటున్న ఆవులు... కడుపు నిండా గడ్డిని మేస్తుండగా .... 'దూడలు' ... తల్లుల పొదుగుల దగ్గర మూతులు పెట్టి... పాలను కుడవడం మొదలుపెట్టేయి.

కళ్లాన్నానుకుని .... జూబురుగా పెరిగిన దొంకల్నుంచి గువ్వలు - ఆగి ఆగి అరుస్తూ... కుడితి గోలెం దగ్గర కొచ్చి.... మళ్ళీ వెనక్కి వెళిపోతున్నాయి.

ఎక్కడ నుంచో 'కోయిల కూత' .. సన్నగా వినిపిస్తూ... వెచ్చని వేసవి గాలిని మోసుకొస్తుంది.

అసిరయ్య... గాలికి పక్కకు జరిగిన గడ్డిని... కర్రతో ఆవుల ముందుకు నెడుతూ..... 'వొక పని ఎత్తిరిల్లిందని ......' అనుకుని చెట్టు మొదలకొచ్చి కూలబడ్డాడు. చెమటకు - చర్మానికి అంటుకున్న గడ్డి పరకలను దులుపుకున్నాడు.

ఎండకు - సూర్యుడు - కుంపట్లో నిప్పుల్లాగా ధుమధుమలాడుతున్నాడు.

చెట్టు మొదల నుంచి ... ఎర్రజీమలు తొర్రల్లోకి బిలబిలమని కదులుతున్నాయి.

అసిరయ్య - ఆవుల వైపు తీక్షణంగా చూస్తున్నాడు.

బుర్రలో ఆలోచలు - రేగుతున్నాయి.

'గడ్డి పరక్కూడా ఎతుక్కునే పరిస్థితి దాపరించింది. అటేర కొండ కాసి ఎల్తే గానీ... నాలుగావుల మేతకు సాలట్లేదు గడ్డి... గడ్డి పరకని ... సులగ్గ తీసిపారిత్తం గానీ... అదేని... నిలువడానికి నీటిసెమ్మొకటి వుండాలగదేటి!'

'యేసీ కాలమొత్తే యిదొక తంటా...'

అనుకున్నాడు

గాలికి - ఆకులు... జల్ జల్‌మని వర్షం కురుస్తున్నట్లు కదులుతున్నాయి.

ఎర్రజీమలు చెల్లా చెదురవుతున్నాయి.

'పశువులకు గడ్డి గాము ఎట్టకపోతే ఈ ఎండలో పడి అవెందట తిరుగుతాయి. మనుషులకే వొచ్చే పేణం.. పోయే పేణం లాగుంది!

మన ఆకలి తీరకపోయినా... ఆటి ఆకలి మట్టుకి తీర్సియ్యాలి.... 'అనుకుని ఆవుల పొదుగుల కాసి కళ్లు మరల్చాడు.

సరైన మేత లేక -పొదుగులు - దగ్గరకు అతుక్కుపోయున్నాయి. బోరలు ఎండిపోయి .. ఎముకలే అవుపడతున్నాయి.

'కొండ కాసి తోలుకుపోయి.... దిగువ మెరకల్లంట ఒదిలితే .... నచ్చినంత మేసేవి.
నునుపుదేరి... బలమెచ్చినట్లు... వుండీయి. ప్చ్.... ఆటికి కూడా ఖర్మ కాలింది."
విచారించాడు.

ఎండ జిగేల్మని కళ్లమీద పడుతుంది. కొమ్మల మీద పరచుకున్న సూర్యకిరణాలు తాకి – ఆకులు... బంగారం రంగులో మెరిసిపోతున్నాయి.

అసిరయ్యకు – కొద్ది దూరంలో... చెట్ల నీడల్లో 'టెంకులాట' ఆడుకుంటున్నారు 'కళ్లపు పిల్లలు!

అసిరయ్య – వాళ్ల వైపు చూస్తూ... చుట్టూ వున్న చెట్ల వైపు కాసేపు చూపు తిప్పాడు.



పచ్చగా – పందిరేసినట్లున్నాయి మామిడిచెట్లు!

కొమ్మల్నుంచి కిందకు వేలాడుతూ.. పిడికిలంతేసి కాయలు.

అక్కడక్కడా – వేపచెట్లు, జామచెట్లు కూడా ఉన్నాయి.

కూర్చున్న చోట నుంచి – కుడివైపుకి తలతిప్పి చూస్తే .... ఇం – కొద్ది దూరంలో ... కొబ్బరి తోట.

ఊరి నాయుడిది.

అసిరయ్య – కొబ్బరిచెట్ల మోపుల మీద కళ్లు నిలిపి.... నాలుకతో పెదవులను తడుపుకున్నాడు.

గుత్తులు గుత్తులుగా కాసిన కొబ్బరి బొండాలు

నీలి బొండాలు

అసిరయ్యకు – నోట్లో నీళ్లు ఊరాయి.

గడ్డిని – ఎప్పుడు తినేయడం పూర్తీ చేస్సాయో గానీ.... నాలుకతో – మూతిపైనా ... కిందా ... నాక్కుంటూ... తోకతో ఈగలను తోలుకుంటున్నాయి పశువులు.

నీళ్ల కోసం మోరలు చాచి 'అంబా...' అరుస్తున్నాయి.

వాటి నీడలు – సాగి సాగి చెట్టు మొదలకొచ్చి.... అసిరయ్య పాదాలను తాకుతున్నాయి.

అసిరయ్యకు – ఆవుల మీద ఆపేక్ష పుట్టింది.

'కుడితి నీళ్ళతో రావాల్సిన కోడలు పిల్ల... ఇంకా రాదేటి! ఇంచే – పూ... కుడితెయ్యకపోతే... బక్కలు ఈవలిపట్టి సవ్వవూ........!'

మదనపడుతున్నాడు

పది నిమిషాలు గడిచింది.

కోడలు వచ్చింది. కానీ ఉట్టి చేతులతోనే వచ్చింది.

అసిరయ్యకు – అర్థమయిపోయింది.

కుడితి నీళ్ళు దొరకక చాలాసార్లు పశువులకు – ఒట్టి నీళ్లే పెట్టి దాహం తీరుస్తున్నాడు.

'వ్యవసాయదారులు... ఆలికేటి.... ఆల గాదుల నిండా... ధాన్యం గింజలు కుప్పబడుంటాయని అనుకుంతరు గానీ... ఏం బతుకులు – బక్కలకు కుడితి నీళ్లకే దిక్కూ దివాణం లేదు............ పేరు గొప్ప – ఊరు దిబ్బ..........'
మనసులో అనుకుంది... బయటకు అనేసాడు.

కోడలు – పేడ కుప్పలు ఎత్తి పెంట మీద వేసింది. పాకముందూ .... గోలెం దగ్గరా గీదు గంపతో కసవ ఊడ్చింది. అసిరయ్యతో – ఏమీ మాట్లాడకుండా... మౌనంగానే పనులన్నీ చేసుకుపోతుంది.

భార్యలేని అసిరయ్య కూడా – కోడలతో ఏ ఊసూ వెయ్యలేదు.

కుడితికి గతిలేకపోయినా...బక్కల దాహం తీరడానికి నీళ్లె పెడదామను పైకి లేచాడు.

ఆ మాట కొస్తే ... ఎండలు ఎక్కినప్పటి నుంచి ఎక్కడో ఒక దగ్గర నుంచి 'నీళ్ళు' తెచ్చి... పెడుతున్నాడు.

మూగజీవాల దాహం తీరుస్తున్నాడు.

అసిరయ్య పైకి లేచి... ఒంటికి అంటుకున్న మట్టిని దట్టితో దులుపుకున్నాడు.

తొడలు వరకూ – సిలకట్టు ఎక్కొట్టి... గట్టిగా బిగించాడు. దట్టిని నడుంకు చుట్టుకున్నాడు.

'కుడితి గోలెం' దగ్గరకు వెళ్ళాడు

పక్కనున్న కావిడిని తీసుకుని... భుజం మీద పెట్టుకున్నాడు.

కావిడిని భుజమ్మీద పెట్టుకున్నాడే గానీ... అడుగు ముందుకు వెయ్యలేకపోయాడు.

'ఆలోచనలు' ముసురుకుంటున్నాయి.

'నీళ్లకని బయలెల్లుతున్నాను గానీ... ఏడుంటయి నీళ్లూ....?' ప్రశ్నించుకున్నాడు.

'సెర్లు ఎండిపోనాయి. బావులు ఎండిపోనాయి. సుక్క నీరు – దొరుకుతుంది గాదు... ఏటి సెయ్యడం!' సందేహంలో పడ్డాడు.

'అటు సూత్తే ఆలు కడవడు నీళ్లు తియ్యనిత్తరను గాదు.... ఎలాగురా దేముడా... ఏటి గత్యంతరం.... ....'

ఆలోచిస్తూ.... ఏమరుపాటుగా ... భుజమ్మీద నుంచి కావిడిని... కిందకు పడేసాడు.

వాతావరణమంతా నిశ్శబ్దంగా ఉంది.

దూరంగా – పెదనాయుడు గారి తోట నుంచి – బోరు కళ్లాలన్నీ కదిలేటట్టు... చెట్లును వేళ్లతో పెకలించేసినట్టు పెద్ద శబ్దం చేస్తూ పారుతుంది.

'ఇదొకటి... రాకాసి నోరెట్టుకుని అడుగు జలంతటినీ పీర్సిత్తంది. యేసీ కాలం లేదు. వానా కాలం లేదు.. నాయుడు దాహం ఎంతకీ తీరదు. మాయదారోడు... ఈల పొలాలు సగ్గవుంటే సాలు... ఎవులు ఎలా పోయినా వొకటే .....!'

నాయుడు మీద అక్కసమంతా వెళ్లగక్కాడు.

ఏదైతే అదైందని... కిందపడిన కావిడిని మళ్లీ భుజానికి కెత్తుకుని... అరకిలోమీటరు దూరంలో నున్న గెడ్డకు దారితీసాడు.

గెడ్డకు వెళ్ళడమంటే... పొన్నూరు వెళ్ళినట్టే. ఆ ఊరినే ఆనుకుని ప్రవహిస్తుంది గెడ్డ.

నెత్తిమీదా – కాళ్ల కిందా..మంటలు రేగుతున్నా... సహనం తెచ్చుకుని నడుస్తున్నాడు... అసిరయ్య....

దారిలో – ఎవరో గుర్తు తెలియని మనిషి... తనను దాటుకుంటూ.... ముందుకు వెళ్ళిపోయాడు.

అసిరయ్య – గతుక్కుమని.... తుప్ తుప్ మని గుండెల మీద ఊసుకున్నాడు.

డిక్కీ నిండుగా ఇసుక వేసుకుని ట్రాక్టర్ ఒకటి అసిరయ్యను దాటుకుంటూ ... భయంకరంగా శబ్దం చేసా్త వెళ్ళిపోయింది.'



రోడ్డుకు ఇరువైపులా పసుపు రంగులోకి మారిపోతున్న చేలు కనిపిస్తున్నాయి. చేలు... నీటి చెమ్మ లేక ఎండిపోయాయి. అసలు పంటే వెయ్యక వెలవెలబోతున్న మడి సెక్కలూ కనిపించాయి.

అసిరయ్య – పావుగంట సేపు నడిచి గెడ్డ దగ్గరకు చేరుకున్నాడు.

గెడ్డ

నిండుకుండలాంటి గెడ్డ

ఒకప్పుడు... ఎవరొచ్చినా కాదనకుండా కావుల్ల కావుల్ల నీళ్లిచ్చి పంపిన గెడ్డ

ఆ ఊరోలు... ఈ ఊరోలు అనకుండా – అందరినీ కలిపి... ఈత ఆడటానికి బడి ఇచ్చిన గెడ్డ. ఇప్పుడు గెడ్డలా లేదు....

నిలువెల్లా గాయాలతో... 'చావు' దగ్గరిపడినట్టుంది.

ఇసుకను ఇష్టా రాజ్యంగా.... తవ్వేయడం వలన ఏర్పడిన గోతులవి.

తరతరాలుగా బిడ్డలకు పాలు తాపిన తల్లి లాంటి గెడ్డను చూస్తూనే.. అసిరయ్య కళ్లల్లో నీళ్ళు తిరిగాయి.

వట్టిపోయిన గెడ్డలో అడుగేసి... ముందుకు కదిలాడు.

'తల్లీ ... గెడ్డ తల్లీ...

చివరి నీటిబొట్టు వరకూ... త్యాగం మీద బతికావే....

దండాలే .. గెడ్డ తల్లి.... దండాలమ్మా-'

చిన్న గొంతుతో గెడ్డని వర్ణిస్తూ ముందుకు నడుస్తున్నాడు.

గెడ్డ ఒడ్డులంట.... తాటి చెట్ల నీడల గుండా... నడుస్తున్నాడు. అక్కడక్కడా – పల్చగా పెరిగిన పచ్చికను మేస్తూ... గొర్రెలు కనిపించాయి.

'గొర్రెల కాపరి ఏడీ.... ఆడిది యే ఊరో...!' అనుకున్నాడు

"యే సెట్టు కిందో నిద్ర పట్టేసుంటాడు... లే...!

మనిషి కనిపిస్తే భయం లాగుంది.. కాలం యింత కరకగా అవుతుందని అనుకోలే...."

గుండె బితుకు బితుకు మంటుంటే.. మరికొద్దిగా ముందుకు నడిచాడు

నీరు మాత్రం కనిపించడం లేదు.

'యిదేమీ ఇసిత్రమో... నీటికి కూడా దొంగతనంగా ఎల్లాల్సొత్తంది. ఏటో మాయాకాలం!'

నెమ్మదిగా తనకు వినిపించినట్టే అనుకున్నాడు.

మనుషులు వస్తున్నారో, లేదోనని వెనక్కి తిరిగి చూస్తూ.. ముందుకు నడుస్తున్నాడు.

కొంత దూరం నడిచాక... ఆగాడు.

నీళ్ళు...

'నీళ్ళతో తళతళా మెరుస్తున్న చెలమ'

నలవ గుంత తీసే పని తప్పిందనుకున్నాడు.

'దాని పక్కనే... మరికాస్తా దూరంలో మరో చెలమ'

'ఈ పూటకి – పశులకి కడుపు నిండా నీరు దొరికినట్టే .....'

ఆనందంతో తబ్బిబ్బయ్యాడు.

నా తల్లి... గెడ్డ తల్లి.. నీళ్లివ్వకుండా ఒట్టి సేతులతోనే పంపదే.. మా అమ్మలగన్న అమ్మ...!'

అనుకున్నాడే... గానీ... లోపల భయం మాత్రం ఉంది.

దోసిట నిండా నీళ్లు తాగుదామని కిందకు ఒంగున్నాడు.

అంతే.....

'అస్పష్టంగా పాదాల గుర్తులు'

బెదిరిపోయాడు

వారం రోజుల క్రిందట – ఇలాగే నీళ్ళ కోసం వచ్చాడు. గెడ్డలో అడుగు పెట్టాడో! లేదో!.. ఆ ఊరి గల మనిషి

అడ్డగించి –

'మల్లొకపాల వత్తే... గూలు ఇరిసిత్తాను.. ముసిలి నా కొడకా......' అని – హెచ్చరించి వదిలేసాడు.

ఆ రోజు – అసిరయ్య – వాడిలో కోపం చూసాడు. కోపంలో కసి చూసాడు.

కసిలో – ఎవరి మీదో.... 'అసహనం' చూసాడు.

అవన్నీ – అసిరయ్య గుర్తుంచుకున్నాడు.

అప్పటి నుంచీ గెడ్డ వైపు వెళ్ళలేదు. మళ్ళీ ఇప్పుడు ధైర్యం

చేసాడు. అదీ మూగజీవాల కోసమే... మెండిగా వచ్చాడు.

దోసిటలోకి నీళ్ళు తీసుకుని తాగాడు.

అరటి డొప్పతో... కుండల్లోకి నీళ్లు తోడడం మొదలుపెట్టేడు.

మధ్యమధ్యలో అటు ఇటూ గమనిస్తూనే ఉన్నాడు.

గొర్రెలు ... పచ్చికను మేస్తూ... మేస్తూ... ముందుకు కదులుతున్నాయి.

పది నిముషాల తర్వాత ఉన్నట్టుండి –

'ఎవర్రా... ఎవరూ.............'

ఒక్కసారిగా దూరం నుంచి కేకలు వినిపించాయి. ఆ అరుపు విని... అసిరయ్య బెంబేలెత్తిపోయాడు. కేకేసిన మనిషి – గట్లెంబటి వచ్చి ... అసిరయ్యను చూసి – 'ఒరే ముసిలి నంజాకొడకా... సెలమలో నీళ్లు తోడ్డానికి అయి... నీ యబ్బ సొమ్మే ట్రా............'

ఆ మనిషి అసిరయ్య మీదకొచ్చేసాడు.

అదే సమయానికి –

'వొరే ... ఆగురా.... పెద్దోడు మీద సెయ్యెయ్యకు... సిన్నా – పెద్దా సూసుకుని మాటాడు....'

అసిరయ్యను ఎరిగిన అసిరయ్య ఊరుగలవాడే – ఎక్కడ నుంచి వచ్చాడో .... ఎదురు తిరిగాడు.



ఆ మాటలకు వాడు మరింత రెచ్చిపోయాడు.

అసిరయ్య వీపు వంచి... ఫడేల్ ఫడేల్మని ... నాలుగు గుద్దులు గుద్దాడు.

అసిరయ్య – 'దబ్'మని... ఇసుకలో కింద పడిపోయాడు.

వాడి గూబ కూడా గుయ్యమన్నది.

'మీ యమ్మల్లారా... మీ యవ్వల్లారా... మా ఊర్లోళ్ని తీసుకొత్తాను.. దమ్ముంటే యిక్కడే వుండ్రా.....'

అనుకుంటూ... ఊరి వైపు పరిగెట్టి వెళ్ళిపోయాడు

అసిరయ్యకు – వెన్ను విరిగిపోయినట్టు అయ్యింది.

నిలబడలేక, నిలబడలేక నిలబడి... కళ్ళంకి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

అసిరయ్యకు – వెన్ను విరిగిపోయినట్టు అయ్యింది.

నిలబడలేక, నిలబడలేక నిలబడి... కళ్లంకి నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

వెళ్ళిన ఆ పొన్నూరు మనిషి – తగువు పెట్టాడు.

తగువు – ఊరి గల ప్రెసిడెంట్ దగ్గరకు వెళ్ళింది.

అసిరయ్య ఊరి గల ప్రెసిడెంటే.

పందింట్లో.... అసిరయ్య, అసిరయ్య ఊరోళ్లు, ఆ ఊరోళ్లు, రెండు ఊర్ల పెద్దలు... అందరూ కలిపి ముప్పై,నలభై మంది వరకు ఉన్నారు.

అందరిలోనూ – ఒకటే ప్రశ్న

తప్పెవరిది?

'చెలమ నీళ్ళివ్వని గెడ్డున్న ఊరోలిది తప్పు కాదు. వేసేకాలం... నీటి కొరత వల్ల – ఆలు ... అలాగ... ప్రవర్తించటంలో తప్పు అవుపించలేదు....'

గొంతు హెచ్చించి... అన్నాడో పెద్ద మనిషి.

'నీళ్ల కోసం... దొంగతనం సెయ్యాల్సిన పనిలేదు. అడిగినంత మాత్రాన ఇయ్యాల్సిన పనీలేదు'

అన్నాడు మరో పెద్ద మనిషి

అసిరయ్య – ఏమీ మాట్లాడలేకపోయాడు.

చుట్టూ మూగిన జనాల్లో గుసగుసలే తప్ప... ఎవరూ బయటకొచ్చి మాట్లాడలేదు.

ప్రెసిడెంట్ – నిర్ణయం చెప్పాడు.

అది నీరయినా ... నీటిలో రాయయినా.... అడక్కుండా తీత్తే దొంగతనమే .... తప్పు తప్పే....

కాబట్టి – తప్పు అసిరయ్యది'

'తప్పు అసిరయ్యది. అవును. అసిరయ్యదే తప్పు......'

మరికొన్ని గొంతులు వంత పాడాయి.

ఊరి పెద్దలందరూ కలిసి... అసిరయ్యను దోషిని చేసారు.

'రాబోయే ఎలక్షన్లో ... మండలాధ్యక్షునిగా గెలవాలంటే – బలం పెరిగి... అధికారం తన చేతిలోనే ఉండాలంటే....... తన అవినీతిని, అక్రమాలని... జనం ప్రశ్నించకుండా ఉండాలంటే – తప్పు అసిరయ్యదే అవ్వాలి, ఏ పాపం తెలియని మూగజీవాలదే అవ్వాలి.

జరిమానాగా – ఐదువందలు... వేసారు.

నెలరోజులు – గడువు విదించారు.

'ఇదెక్కడ న్యాయం?! గొంతెండి బుక్కడు నీళ్ళ కోసం అల్లాడినా తప్పేనా.......'

జనాల్లో గుసగుసలు

'దగుల్బాజి పెద్ద నాయుల్లు ... వొచ్చింది ఈల బుంగపోతులకే సాలదు ఇంక.... ఊరి బాగు ఈలకి కావాలేటి!'

ఇంకొందరు అనుకున్నారు.

ఈల ఇల్లల్లోనే – మోటారు, కులాయిలు వుండాల... రోజల్లా నీళ్ళియ్యాల... ఈధి కులాయిలు పనిసెయ్యట్నేదూ....

'సూడండ్రా....' అని మొరపెట్టుకుంతే – 'ఊ' అనరు – 'ఆ'... అనరు.'

ఒకామె కోప్పడింది.

'హొరె అసిరయ్యా! తప్పితే ఈలు పెద్ద మనుషులంతారు.. ఎవులి గుండిల్లోనా పిసరంత దయనేదురా.... సలవ గుంతలపాటి సెయ్యర్రా ఈలు....'

నిట్టూర్చింది – వరసకి చెల్లి అయ్యే వెంకట్లమ్మ.

'యింత బతుకు బతికినావు... ఆల తోటి శిచ్చించబడ్డానికేటిరా.....'

బాధపడ్డాడు 'బావూ....' అని పిలుచుకునే పైడయ్య తాత.

'వారే … అయ్యా! ముసిలోడివని సూడకుండ ఒళ్లు పుండయినట్టు – బాదీసేదురా… ఆడి జిమ్మబడ….' తండ్రి ఒంటికి నూనె రాస్తూ… ఏడ్చింది కూతురు లక్ష్మి, అందరూ చెప్పినవన్నీ – అసిరయ్య మౌనంగా విన్నాడు. అవన్నీ – గుండెను పట్టి …. ఉక్కిరిబిక్కిరి చేసాయి. అసిరయ్య ఒక్కటే అనుకున్నాడు –

'పుట్టిన కాంచి – సచ్చీ వొరకూ…. కళ్ళం పట్టు నుండి మన సాకిరీ సేసే బక్కలు… ఈవలొట్టిపోయి సత్తుంటే … సేతులు కట్టుకుని ఊరుకుంతామా?! మనిషన్నాక….దయుండొద్దూ… ఆటి ఆలన పాలనా సూడొద్దూ… తనను తానే ప్రశ్నించుకున్నాడు.

ఆ రాత్రి – అసిరయ్యకు నిద్రపట్టలేదు.

జరిగిన తంతుకి – అసిరయ్యకు .. ఎప్పుడూ రాని దుఃఖం వచ్చింది. దెబ్బలు తిన్నందుకు కన్నా… న్యాయం – న్యాయంగా లేనందుకు బాధపడ్డాడు.

ఆ రాత్రి

వీధంతా చీకటి

ఇంట్లో అందరూ – నిద్రమీదున్నారు

చందమామను మబ్బులు కమ్మేసాయి

అసిరయ్య పెరట్లోకెళ్లాడు

వేపచెట్టుకు ఉరేసుకుని… తెల్లారికి శవమై పోయాడు. నీళ్లకోసం… మూగజీవాల దాహం కోసం ఆలోచించిన అసిరయ్య – ఆ నీళ్లనే ఎరుపు చేసిన పెద్ద మనుషుల వలనే మరణించాడు.

అసిరయ్య చావుతో

ఇంతవరకూ … పెద్దోల ఆగడాలను సహించిన వాళ్ళంతా…. ఒక్కసారి కట్టులు తెంచుకున్నట్టయ్యారు.

ఆ కదలిక.. ఊరంతా పాకింది.

'పెతీ ఏటా… నీళ్లకోసం – కొట్టుకోవడం, తన్నుకోవడం… ఇదెక్కడి కర్మరా మనకి… ఇన్నాళ్లూ నోర్మూసుకోనున్నాం.

ఊరి నాయకుల భాగోతం తెలిసినా…. ఏవ్రీ ఎరిగనట్టే ఊరుకున్నాం. లాభం లేదురా… ఏదొకటి సెయ్యాలి….' నడి వయసు రామ్మూర్తి అన్నాడు.

'అవున్రా… బావా… నాయకులని నిలేసిన వరకే ఆల ఆటలు… నిలేత్తేనే గదా – ఆ డొల్ల ప్రజలకు తెలిసేది..!'

తిరుపతి రావు అన్నాడు.

'గండ ముండ కొడుకులని.. ఊతికి ఆరేసిద్దాం పదంద్రా…….'

అసిరయ్య కూతురు – 'లక్ష్మి'

అందరూ – 'నాయకులు' అని పేరు పెట్టుకున్న వారి మీద తిరగబడాలనే అన్నారు.

చివరగా – 'క్రిష్ణమూర్తి నాయుడు' చెప్పాడు

"ఎవరూ… ఆవేశపడొద్దు. రేపో ఎల్లుండో – మన ఊరు – ఎమ్.ఎల్.ఎ, అధికార్లు, మందీ మార్బలం… అంతా వస్తారు. 'ప్రజాహితం' పేరున ప్రభుత్వం – ప్రజల సమస్యల పరిషార్కానికి కార్యక్రమంపెట్టింది. ఆ రోజు – ఊర్లో సభ పెడతారు. ఆ సభలో నిలదీస్తే … మన ఆవేశానికి అర్థముంటాది."

అందరికీ హితబోధ చేసాడు.

రోజు రానే వచ్చింది.

కాన్వాయ్‌తో ఎమ్.ఎల్.ఎ, అధికారులు… వీళ్ల వెంట పోలీసులు అంతా దిగారు.

ఊరి మధ్యలో సభ పెట్టారు.

పక్క పక్క ఊర్ల నుంచి కూడా – జనాలు హాజరయ్యారు. ఎమ్.ఎల్.ఎ గారు మాట్లాడారు.

'మన గ్రామాలను సంక్షేమం బాటులో నడపటానికే … మన ప్రభుత్వం – 'ప్రజాహితం' కార్యక్రమం పెట్టింది. మీ సమస్యలు మాకు చెప్పండి. మేము పరిష్కరిస్తాం!

ఊరిలో పని చేయని చేతిపంపుల గురించి, దోమలు పెరిగే మురికి కాల్వల గురించీ, ఏడాదైనా ప్రారంభం కాని నీటి పథకాల గురించీ, పొలాలు ఎండిపోయి చావడానికి కారణమయిన …. నాయుళ్ల బోర్ల గురించీ, ఇసుక అక్రమ రవాణా గురించి – ఏవేవి చెప్పాలనుకున్నారో అన్నీ చెప్పారు.

ఎమ్.ఎల్.ఎ. గారి పి.ఎ – అన్నీ రాసుకుంటున్నాడు.

'సభ' చివరకొచ్చింది.

ఎమ్.ఎల్.ఎ, అధికార్లు, చిన్నా – పెద్దా నాయుళ్ళు – అందరూ లేచి పోవడానికి సిద్ధమయ్యారు.

ఒక్కసారి జనాల్లో అలజడి – ఎవడికి దొరికినంత ఆదు బుక్కిత్తే… సంక్షేమ పథకాలు అమలవుతాయనుకోవడం మా భ్రమే…!

గుంపులోనుంచి కేకేసినట్టు అన్నారెవరో….

'మీరు – నిజంగా– మా బాగుకోరే నాయకులే అయితే….. బొంకులు ఆడ్డం ఆపి…. ముందు మా సమస్యలు పరిష్కరించండి'

మాలపేట రాజప్పుడు గొంతెత్తాడు.

"ఊరిని బాగుసేద్దాం… ప్రజల కట్టాలు తీరుద్దాం. ప్రజల దాహం తీరుద్దాం…'

అని మీ నాయకులు కలలోనైనా అనుకున్నా్రా…."

గుంపులో నుంచే ప్రశ్నించిందో – ముసలమ్మ,

'అసిరయ్య సచ్చిపోవడానికి దాహంతో మా గొడ్లు సవ్వడానికి కారణమెవరు?' ప్రశ్నించాడో యువకుడు.

ఎమ్.ఎల్. ఎ నుంచి – మండల, గ్రామ స్థాయి నాయకులు, అధికార్లూ… అందరూ తెల్లముఖాలేసారు.

ఎత్తిన గొంతులు – నాయకుల గుండెల్లో బాణాల్లా దిగబడ్డాయి. నాలుగువైపుల నుంచి ప్రశ్నలు – వరదలాగా ముంచుకొచ్చాయి. చిన్నా, పెద్దా, ముసలీ ముడగా – అందరూ పిడికిళ్లెత్తారు. ఎత్తిన పిడికిళ్లు – పక్క పక్క ఊర్లనూ నిద్రలేపాయి.

## మే నెల పురస్కారాలు





**బతుకు యుద్ధం**

**కథకు........రూ.700/-**

రచయిత : డా॥ ఎం. హరికిషన్

**ఆవిష్కరణోత్సవం**

**కవితకు.......రూ.500/-**

రచయిత : గోపగాని రవీందర్

**సినీ రచయిత జనార్ధన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

# వేదన

- చొప్ప వీరభద్రప్ప

9492450984



మావికొమ్మెక్కి కొత్తచివురు మత్తుల్లో
కోయిలసంతు కొమ్మకొమ్మకు గంతులేస్తుంటే!
పరిమళించిన ఆనందం రవళించిం దనుకుంటి
పూతపట్టిన యింపుల్లో సొంపుగ
కలకూజిత గానాలు మురిపెంగా ముద్దిస్తుంటే !
ప్రకృతి హేళికి సర్వస్వం నేనే ననుకుంటి
చిరుపిందెల మువ్వల సవ్వడిలో
పులుపు వగరు, రుచుల రోచిస్సులు
కమ్మగ నాలుక జుర్రు కొంటుంటే !
ముంచిన ప్రాణ స్పర్శ, చక్కెర పాకంలో
మునిగి తేలుతుందనుకుంటి
తేనెలూరు మధుర ఫలపక్వ సోయగాలు
మైమరిచి ఆస్వాధిస్తుంటే !
అరమోడ్పు కన్నుల్లో ఆదమరచి
వెలుగురేఖ నేనే ననుకుంటి
ఆకులు పండి, వన్నెలుడిగి, కొమ్మలెండుకతో
ఉధృతగాలి, విసుర్లు కసుర్లు
విరుపుల కరుపులతో వీస్తుంటే !
అంతరంగం, వేదన రోదనల, సుళ్ళు తిరుగ
నిరాశ నిస్పృహల నిర్వేదనలో
చేవలేక చేష్టలుడిగి చెమ్మగిలితి
చారెడు కృతజ్ఞత కరువై
చిటికెడు ప్రేమ మరుగై
కన్నీటి జడి తెరవెనుక రొప్పతుంటే !
మలిసంధ్య నీడలో జ్ఞాపకాల ఆవరణలో
వేడెక్కిన వెన్నెల తీగలు గుండె గుచ్చ
నిశ్శబ్దపు టద్దంపై, నన్నునే చూసుకుంటూ
వొంటరినై నాలో నేనే నన్నునే మరిచి
శోకాగ్ని హృదయ గర్భంలో చొచ్చుకొని వొత్తుకొని
పెల్లుభికిరాగా, హిమానీనదమై ప్రవహిస్తున్నా !!

# సమూహం

డా॥ ఎన్. గోపి

నిజానికి ఆ కలయిక
జీవ కణాల కదలిక
అణువణువూ ఒక కన్ను
అన్నిటికీ కాలం వెన్నుదన్ను

వీచే గాలి
పారే నది
భూమిపైన బోర్లించిన
ఆకాశం మూత
మనోహర దృశ్యాల
కలనేత

అదొక సృజనకల్లోలం
నలుగుకలిసి
ఒకే మేఘాన్ని ఎగరేసే
అపురూప దృశ్యం
ఒక అతీత భావన
వెచ్చని కిరణాల దీవెన
నలుగురు కూచొని నవ్వేవేళ
అదొక ఆనందహేల
ఎంతకూ తీరని దాహం
మానవీయ మహాస్నేహం

ఆకాశం నుంచి చూస్తే
భూమ్మీది ఇళ్లన్నీ చిన్న చిన్న శకలాలు
కిందికి దిగి వస్తే
జీవన మహాకావ్యాలు



# ఏకైక భాష

సి.హెచ్.వి. బృందావనరావు
9963399189

బతుకు వాచకంలో
చిరునవ్వుల పేజీలన్నీ చిరిగిపోయి
జీవితపు సిలబస్‌కూ
కొశ్చన్ పేపర్‌లోని ప్రశ్నలకూ
పొంతనేలేని పరీక్షలైపోయాయి రోజులు !
ఇప్పుడు కలవడాలు లేవు
కరచాలనాలు లేవు
కలుసుకొని కన్నీళ్ళు కలబోసుకోడాలూ లేవు
ఎవరి ఏడుపులను వారు భుజాల కెత్తుకుని
కావడి బద్దలై కనులు తుడుచుకోవడమే
బ్రతుకులన్నీ భగ్నవీణలై
ఒక అభద్రతావలయపు వేదిక మీద నుంచి
అపస్వరాలు కచ్చేరీలు చేస్తున్న
సందర్భంగదా ఇప్పుడు.
గుండెల్లో బాధలు సలుపుతున్నా
వేదనను వ్యక్తం చేయడానికి
గొంతులోనే మాటలు గుడిసిళ్ళు పడుతూ
బయటికి వెళ్ళగక్కలేని
ఒక చిత్రమైన భయానుభవం
అంతటా ఆవరించుకున్న అవస్థ గదా ఇప్పుడు.



ప్రజా పాలన వ్యాపార సంస్థానిర్వహణగా మారి
నేతలు సి.యి.వోలుగా పోటీ పడుతూ
లాభార్జనే ఏకైక ధ్యేయమై
పవర్ పాయింట్ ప్రజంటేషన్లకు
పాథేయమౌతున్నప్పుడు
బ్రతుకులన్నీ వాణిజ్య వనరులవడంలో
వింతేముంది !
మమతలన్నీ మారకపు వస్తువులూ
ఆత్మలు గూడా అంగడి సరుకులూ ఐపోయ్యాక
వ్యాపారావసరాలు ప్రపంచపుటెల్లల దాకా
విస్తరించే కొద్దీ
మనుషుల బ్రతుకులు లోపల్లోపలికి
కుంచించుకుపోయే
విలోమగణిత సమీకరణాలు
పరిష్కారం దొరకని
పజిళ్ళుగా మిగిలిపోతున్నాయి.
ముఖాల గోడల మీద
చిరునవ్వుల వెల్లవెలిసిపోయి
కఠోర వాస్తవికతల కుమ్మరావంలో
మట్టి ముద్దలై గింగిరాలు తిరుగుతున్నాయి బ్రతుకులు
దుఃఖం ఇప్పుడొక సామూహిక స్పందనై
ఏడుపొక్కటే ఏకమై భాషగా రూపుదిద్దుకుంటున్నది

# ఇప్పటి దాకా కవిత్వం

**తోకల రాజేశం**
9676761415



**కవిత్వాన్ని ఏ శక్తులు ప్రభావితం చేస్తున్నాయి ఆ కవిత్వం ద్వారా మళ్ళీ ఏ శక్తులు ప్రభావితం అవుతున్నాయి - అన్న ఖచ్చితమైన స్పృహ మాత్రం కవులకుండాలి. ఆ స్పృహ లేని వాళ్లు ఎవరూ కవిత్వం రాయలేరు గాని - ఆ స్పృహను వక్రీకరించే లేదా వేరే దారిలోకి మళ్లించిన కవులు చరిత్రలో చాలామందే దొరుకుతారు. సమాజం అన్నప్పుడు పాలకవర్గం - పాలితుల వర్గం అనేవి ఉండనే ఉంటాయి. మన తెలుగులో భావ కవిత్వం పుట్టడానికి మునుపు - ఉత్పత్తి అయిన కవిత్వంలో చాలా ఎక్కువ భాగం పాలక వర్గ ఆధిపత్యాన్ని - వాళ్ల సంస్కృతిని కొనసాగించటం కోసం పాటుపడిందే.**

"ఆదిమ మానవ వ్యవస్థలో కవిత్వం సౌందర్యాన్ని ఆరాధించి, ఆనందించే ఒక సాధనంగా మాత్రమే కనిపిస్తుంది" అంటారు సుప్రసిద్ధ సాహిత్య విమర్శకులు టీ.యల్. కాంతారావు. అసలు కవిత్వమంటే ఏమిటి ? ఆ కవిత్వం అనివార్యంగా ఎందుకు పుట్టవలసి వస్తుంది? మనిషి తన జ్ఞానేంద్రియాల ద్వారా పొందిన అనుభూతి చైతన్యాన్ని అక్షరాల లేదా భాష సహాయంతో సరికొత్తగా వివరించే ప్రయత్నం చేయటమే "కవిత్వం". కవిత్వంతో నిండిన రచనే "కావ్యం" "విశ్వ శ్రేయ కావ్యం" అన్నారు అలంకారికులు. రస గంగాధర కర్త కావ్య ప్రయోజనం ''పరమాహ్లాదం'' అన్నాడు. ఆంగ్ల విమర్శకుడైనబ్రాడ్లే "కవిత్వం కవిత్వం కోసమే" అన్నాడు. ఈ రకరకాల వాదాలలో నుంచి రెండు విషయాలను స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు. మొదటిది కవిత్వం - కవిత్వంగా వుండాలి. రెండోది - దానికో ప్రయోజనముండాలి. ఆహ్లాదాన్నివ్వటమైనా - చైతన్యాన్ని పురికొల్పటమైనా ఆ కవిత్వం అందించే ప్రయోజనంలో భాగంగానే చూడాలి. అయితే ఏ కాలంలోనైనా మిగతా అన్ని ప్రక్రియలతో పోలిస్తే కవిత్వమే ఆయా చారిత్రక సంఘటనలకు ముందూ - వెనుక నిలిచి వ్యాఖ్యానిస్తూ వుంటుంది. ఈ విషయంలో ఎవరికీ భిన్నాభిప్రాయాలు ఉండకపోవచ్చు. దానిక్కారణం - ఆయా సంఘటనల నేపథ్యంలో పొందిన తక్షణ ప్రేరణ బలంగా వుంటుంది కాబట్టి - అదే సమయంలో అది తక్కువ కాలం పాటే నిలిచి వుంటుంది కాబట్టి - అది కవితా నిర్మాణానికి మాత్రమే దారి తీస్తుంది. ఏ ప్రేరణా లేకుండా కవిత్వం రాయటం అసాధ్యం. కథానిక, వ్యాసం, నవలాది ప్రక్రియలకు - ఒక ప్రణాళికా వగైరా అవసరం పడతాయి కాబట్టి - సహజంగానే ఈ ప్రక్రియలు కవిత్వంతో పోలిస్తే (ఒకానొక సంఘటన నేపథ్యంలో) నెమ్మదిగా సాహిత్య ప్రపంచంలోకి వస్తాయి. కనుకనే సమాజంలో జరిగే ఏ విధమైన మార్పులైనా మొదటగా కవిత్వంలోనే ప్రతిఫలిస్తాయి.

ప్రాచీన కాలంలో ఉత్పత్తి అయిన కవిత్వమంతా ఈ సిద్ధాంతానికి ఎప్పుడూ ఒక మినహాయింపుగానే మిగిలిపోతుంది. ఏ కాలంలోనైనా - పుట్టిన కవిత్వంలో ఆ కాలం నాటి సామాజిక, రాజకీయార్థిక, సామాజిక శక్తులు ప్రతిఫలిస్తూ వుంటాయి. రాజుల శృంగారాలకు, దేవతల మహిమాన్విత శక్తులకూ - అధిక ప్రాధాన్యతనిచ్చి సృష్టించిన ప్రాచీన సాహిత్యంలో పైన చెప్పిన శక్తులు సంపూర్ణంగా ప్రతి ఫలించాయని ఎవ్వరూ అనుకోరు. మంచికో చెడుకో ఆ శక్తుల ప్రభావం మాత్రం కొంత మేరకు పడిందన్నది మాత్రం నిజం. అయితే, కవిత్వాన్ని ఏ శక్తులు ప్రభావితం చేస్తున్నాయి ఆ కవిత్వం ద్వారా మళ్ళీ ఏ శక్తులు ప్రభావితం అవుతున్నాయి - అన్న ఖచ్చితమైన స్పృహ మాత్రం కవులకుండాలి. ఆ స్పృహ లేని వాళ్లు ఎవరూ కవిత్వం రాయలేరు గాని - ఆ స్పృహను వక్రీకరించే లేదా వేరే దారిలోకి మళ్లించిన కవులు చరిత్రలో చాలామందే దొరుకుతారు.

సమాజం అన్నప్పుడు పాలకవర్గం - పాలితుల వర్గం అనేవి ఉండనే ఉంటాయి. మన తెలుగులో భావ కవిత్వం పుట్టడానికి మునుపు - ఉత్పత్తి అయిన కవిత్వంలో చాలా ఎక్కువ భాగం పాలక వర్గ ఆధిపత్యాన్ని - వాళ్ల సంస్కృతిని కొనసాగించటం కోసం పాటుపడిందే. పాలక వర్గ ప్రయోజనాల కోసం సృష్టించబడిన కవిత్వం - ఆ పాలక వర్గాల చేత ప్రయోజనాలు పొందిన వాళ్లు సృష్టించినదే అన్న విషయం ఇక్కడ గమనించ వలసి వున్నది. ఇంత చిమ్మ చీకటిలోనూ - అక్కడక్కడ అప్పుడున్న దిగజారిన పరిస్థితుల మీద యుద్ధం ప్రకటించి - కొత్త వెలుగు దారులను పరిచిన వాళ్లూ లేకపోలేదు. ప్రాచీన కాలంలో పాల్కురికి సోమనాథుడు, మధ్యయుగంలో వేమన, పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామి, ఆధునిక యుగంలో గురజాడ, శ్రీశ్రీలు.

ఆధునికతను గుణవాచి అనుకుంటే ఆయా కాలాల్లో వీళ్లందరూ అద్భుతమైన ఆధునిక కవులు. ఒక రకంగా విప్లవాచరణ కలిగిన వాళ్లు, ఆయా కాలమాన పరిస్థితుల నుంచి ఉత్పన్నమయ్యే పరిమితులు గురజాడ, శ్రీశ్రీ (వీళ్లకూ కొన్ని రకాల పరిమితులు ఎలాగూ ఉన్నాయి) లను మినహాయిస్తే పై వాళ్లందరికీ వున్నాయి. అందుకే వాళ్లు వేసిన దారుల్లో సమాజం మొత్తాన్నీ నడిపించలేకపోయారు.

ఒక రకంగా చెప్పాలంటే, తెలుగులో జాతీయోద్యమ కాలం నుంచే కవిత్వానికి కొన్ని ఆధునికపు పోకడలు - ప్రభావవంతంగా ప్రారంభమైనాయని చెప్పవచ్చు. ఇక్కడ ఆధునికత ఎక్కువగా కవిత్వానికి తీసుకున్న వస్తువులో వుంది. అలాగే భాషలోనూ, వస్తువులను భావించే విధానంలోనూ శిల్పంలోనూ వుంది. "మహా కావ్యానికి క్రైటేరియా / సైజూ బరువూ కావయా / నిన్నటి మహా కావ్యానికి పద్దెనిమిది పర్వాలైతే / నేటి మహా కావ్యం పద్దెనిమిది పేజీలే - అన్న శ్రీశ్రీ మాటలను అర్థం చేసుకుంటే కవిత్వానికీ - ఆధునికతకూ మధ్య గల సంబంధం అర్థమవుతుంది. అదే శ్రీశ్రీ - మనిషి కోసం కవిత్వం / మంచికోరి నవత్వం - అంటాడు. ఇలా కొత్త చూపుతో ప్రారంభమైన కవిత్వం నేటి సామాజిక జీవితంలోని సకల పార్శ్వాలనూ - లోతులనూ స్పృశిస్తూ - ఇప్పుడు నడవవలసిన దారిలో నడుస్తోంది. అయితే కవిత్వం అనగానే అనాది కాలం నుంచి ఇప్పుడు కూడా వస్తున్న పద్య కవిత్వం - ప్రస్తుతం ప్రధానంగా వెలువడుతున్న వచన కవిత్వం - రెండూ కలిస్తేనే ఇప్పటి కవిత్వానికి సంపూర్ణమైన అర్థం వస్తుంది. పద్యం విభాగంలో నేడు వస్తున్న కవిత్వం చాలా తక్కువేమీ కానప్పటికీ - అనాదిగా దానికి సహజంగానే అంటిపెట్టుకొని వున్న కొన్ని రుగ్మతలు ఇంకా పోలేదనే చెప్పాలి. ఉత్పత్తి అవుతున్న పద్య కవిత్వంలో సగం దాకా ఇంకా గ్రాంధికచ్ఛాయలలోనే ఊయలలూగుతూ ఆనందిస్తున్నది (పద్యంలో గ్రాంధికచ్ఛాయలు తొలగించటం దాని నిర్మాణ రీత్యా పూర్తిగా సాధ్యపడకపోవచ్చు. కానీ కొంత వరకు విజయం సాధించవచ్చు). ఇక్కడ గల నష్టమేమిటంటే - ఇలాంటి కవిత్వంలో ఎంత అభ్యుదయకరమైన వస్తువు తీసుకున్నా - గోడకు అవతల వున్న వస్తువును చూడటం ఎలాగైతే సాధ్యం కాదో - ఆ కవిత్వాన్ని పాఠకుడు అందుకోవటమూ అలాగే సాధ్యం కాదు. మిగతా సగం పద్య కవిత్వంలో సరళత సాధించబడుతున్నప్పటికీ - అది కేవలం ఉపదేశానికి (నీతి సూత్రాలు) పరిమితమైనదిగానో - దేవతామూర్తులను నోటికి వచ్చిన విధంగా పొగుడుతున్నది గానో - మాత్రమే వుంటుంది. ఈ రెండు విభాగాలకు దొరక్కుండా తప్పించుక తిరిగే పద్య కవిత్వమూ అప్పుడప్పుడూ ఒయాసిస్సులా అక్కడక్కడ దర్శనమిస్తూ వుంటుంది. రూపం తప్ప మిగతా అన్ని విషయాల్లోనూ ఆధునిక లక్షణాలను పుణికిపుచ్చుకున్న కవిత్వం ఇది. తరుచుగా వస్తున్న భక్తిశతకాలు, భక్తి కావ్యాలు, అభినవ ప్రబంధాలు - మొదటి రెండు విభాగాలకు ఉదాహరణ కాగా, స్పష్టమైన చారిత్రక స్పృహతో, తెలుగునాట ప్రస్తుతం జరుగుతున్న అనేక ఉద్యమాల ప్రతిఫలనంగా - సరళతను సాధిస్తూ వస్తున్న పద్య కవిత్వం మూడో రకానికి ఉదాహరణ. ప్రాచీన కాలం నుంచీ పద్యానికీ - ఆధ్యాత్మికతకూ మధ్య ఏర్పడిన అవినాభావ సంబంధం వల్లనో ఏమో - ఇప్పటికీ పద్య కవిత్వంలో ఎక్కువగా ఆధ్యాత్మికతా సంబంధమైన గాలులే వీస్తున్నాయి. అయితే ముందు చెప్పుకున్న రెండు విభాగాలకు చెందిన పద్య కవిత్వం - కవిత్వం కాదా ! అంటే కాదు అని చెప్పలేం. కాకపోతే ఎక్కువ మంది విమర్శకుల అభిప్రాయం ప్రకారం కవిత్వం అన్నప్పుడు - దానికో ప్రయోజనముండాలి. ఆ ప్రయోజనం హృదయ సంస్కారాన్ని పెంచేదిగానో, సామాజిక చైతన్యాన్ని యిచ్చేదిగానో వుండాలి. ఈ వెలుగులో చూసినప్పుడు ప్రజల నుంచి, వారి సహజానుభూతుల నుంచి విడిపోయిన కవిత్వానికి గల విలువలు పడిపోయే అవకాశాలుంటాయి.

**వచన కవిత్వానికి సహజంగానే కొత్త వాళ్లను ఆకర్షించే గుణము - వాళ్లను బలమైన కవులుగా తీర్చిదిద్దే సత్తా - రెండూ వున్నాయి. ఈ నేపథ్యంలోనే, వినడానికి కొంత ఆశ్చర్యంగా అనిపించినప్పటికీ మునుపెన్నడూ లేని విధంగా వచన కవుల సంఖ్య పెరిగింది. ముద్రిత పత్రికలతో బాటు అంతర్జాల పత్రికల్లోనూ, స్వంత సంకలనాలతో బాటు సామూహిక సంకలనాల్లోనూ - వచన కవిత్వం విరివిగా సృష్టించబడుతున్నది.**

నేడే పత్రికను ముట్టుకున్నా - కవిత్వం అంటే కేవలం వచన కవిత్వమే - అని నిర్మొహమాటంగా తీర్మానించగలిగిన స్థాయిలో వచన కవిత్వం వస్తున్నది. "శ్రీశ్రీ, శిష్ట్లా మొదలయిన కవులతో ప్రారంభమైన వచన కవితా ప్రక్రియ ఆ తరం కవులలో ప్రయోగాత్మకంగా నిలిచి, ఈ తరం కవులలో సంప్రదాయంగా విస్తరించింది" అని 40 ఏళ్ల కిందట టి.యల్. కాంతారావు గారు అన్న మాటలను ఇక్కడ గుర్తు చేసుకోవాలి. అక్కడి నుంచి ప్రయాణం చేస్తూ వస్తున్న వచన కవిత్వం మొదలుగా అభ్యుదయ - విప్లవ వాదాలనూ అనంతరం స్త్రీ దళిత వాదాలను, ముస్లిం - మైనారిటీ వాదాలనూ బలమైన గొంతుకతో వినిపించి ప్రస్తుతం అస్తిత్వ (స్థానికత) ఉద్యమాలతో బాటు ప్రపంచీకరణ దుష్పరిణామాలనూ ఎప్పటికప్పుడు ఎత్తిచూపిస్తూ - ముఖ్యంగా ఆధునిక జీవితంలో భాగమైన ప్రతీ అంశం మీద వెలుగును ప్రసరిస్తూ - వొక విశాలమైన ఆవరణాన్ని నేడు సిద్ధం చేసుకున్నది. వచన కవిత్వానికి సహజంగానే కొత్త వాళ్లను ఆకర్షించే గుణము - వాళ్లను బలమైన కవులుగా తీర్చిదిద్దే సత్తా - రెండూ వున్నాయి. ఈ నేపథ్యంలోనే, వినడానికి కొంత ఆశ్చర్యంగా అనిపించినప్పటికీ మునుపెన్నడూ లేని విధంగా వచన కవుల సంఖ్య పెరిగింది. ముద్రిత పత్రికలతో బాటు అంతర్జాల పత్రికల్లోనూ, స్వంత సంకలనాలతో బాటు సామూహిక సంకలనాల్లోనూ - వచన కవిత్వం విరివిగా సృష్టించబడుతున్నది. అయితే ఉత్పత్తి అవుతున్న కవిత్వమంతా ఉత్తమమైనదేనా? అంటే విమర్శనా దృష్టి వున్న వాళ్లెవరైనా కాదనే చెప్తారు. కాకపోవటానికి అనేక కారణాలున్నాయి. ఇప్పుడు వచన కవిత్వం రాస్తున్న కవులలో 35 ఏళ్లలోపు వారు నిజానికి చాలా తక్కువే. కవిత్వం పల్చగా తయారవడానికి ఈ యువకులు ఎంతగా కారణం అవుతున్నారో అలాగే 35 ఏళ్లు పైబడిన వర్గంలోని కొందరు కవులూ అంతే కారణమవుతున్నారు. అంటే అధ్యయనశీలత కొరవడింది కేవలం యువకుల్లోనే కాదు వయసులో పెద్దవాళ్లైన కవులలోనూ ఈ లోపం వుంది. వచన కవిత్వ ప్రారంభ వికాసాల గురించి తెలుసుకోకపోవటం

– చరిత్రలో దానికి గల సంబంధాన్ని గుర్తించలేకపోవటం – కూడా కారణాలే. ఎలాంటి సందర్భంలో నుంచి వచన కవిత్వం ప్రారంభమయ్యిందో తెలుసుకుంటే ఇప్పటి వచన కవిత్వం యొక్క తాత్విక నేపథ్యాన్ని కొంత వరకు అవగాహన చేసుకోవచ్చు. అయితే ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే ఇప్పుడు వచన కవిత్వం రాస్తున్న చాలామందిలో ఇతరుల కవిత్వాన్ని చదివే అలవాటు లేదు. 'అలా చదవకపోవటం కూడా ఈ యుగ లక్షణమేనేమో?" అని 40 ఏళ్ల క్రితమే టి.యల్.కాంతారావు చమత్కరించారు. 1960 మార్చి, "సవ్యసాచి" సంచికలో వ్యాసం రాస్తూ సుప్రసిద్ధ సాహితీ విమర్శకులు రాచమల్లు రామచంద్రారెడ్డి యువకులనుద్దేశించి – "ఈ తరం వాళ్ళు యువరచయితలు కొందరు ఇప్పుడిప్పుడే తలయెత్తుతున్నారు గానీ, ఉత్సాహం వున్నంత ఉపజ్ఞ కనబడదు. ఉత్తమ రచయితలు కాగల మేధస్సంపద ఉన్నట్లు కనబడదు. ఉత్తమ సాహితీ సాధనకు అవసరమైన దీక్షా జిజ్ఞాసల కంటే అల్ప సంతుష్టి ఆత్మోత్కర్షలే ప్రబలంగా కనబడుతాయి." అంటారు. 50 ఏళ్ల తరువాత కూడా పరిస్థితిలో మార్పు రాకపోవటం దురదృష్టకరం. అయితే ఇదంతా నాణేనికి ఒకవైపు మాత్రమే. మరోవైపు కొత్తరీతులతో – సరికొత్త అభివ్యక్తులతో – మునుపెన్నడూ లేని ఒక రకమైన కొత్తచూపుతో వచన కవిత్వం బలంగా వస్తున్నది. మొన్న మొన్నటి దాకా వెంటాడిన సంక్లిష్టతలను దాటి ఒకానొక స్పష్టతతో ఈనాటి వచన కవిత్వం అడుగులు వేస్తోంది. వివిధ ఉద్యమాల నేపథ్యంలో వెలువడుతున్న కవిత్వంలో, వివిధ రకాల స్థానికతల మీది నుంచి ప్రసరిస్తున్న కవిత్వంలో, సభ్య సమాజం తలదించుకునే సందర్భాలు ఎదురైనప్పుడు పుడుతున్న కవిత్వంలో, – ఈ స్పష్టత సహజంగానే సంపూర్ణంగా కనిపిస్తున్నది. పైన చెప్పిన సందర్భాలకు స్పందనగా వస్తున్న వచన కవిత్వంలో ఒక చిన్న ఇబ్బందిని కూడా మన గమనించవచ్చు. అదేమిటంటే – ఆవేశమో, ఆవేదనో ఎక్కువైనపుడు కవిత్వం నినాద ప్రాయంగా మారటమో, లేక కరుకు రూపమెత్తటమో జరుగుతుంది. ఈ ఇబ్బందిని అధిగమించిన కవిత్వమే నేడు ఎక్కువగా వస్తుంది. "అనేక" (పదేళ్ల కవిత్వం 2000-2009)కు సంపాదకత్వం వహించిన అఫ్సర్, వంశీకృష్ణలు తమ ముందు మాటలో" కవిత్వంలో ఇప్పుడు పునర్నిర్వచనానికి లోనవుతున్న అనేక వాదాలు, మత, కుల, లింగం మొదలైనవన్నీ కూడా వలసానంతర దృక్కోణం నుంచి, పునర్మూల్యాంకనం చేసుకోవాల్సిన అవసరం వుంది". అంటున్నారు. "జీవితంలో కొన్ని కేంద్రాలు వాటి స్థానాన్ని కోల్పోయాయి. అసలు కేంద్రం అనేదే అనేక కేంద్రాలుగా చెదిరిపోయింది. అందుకే మనం నిర్దిష్టంగా మాట్లాడే విషయాలు కూడా నిత్యం ప్రశ్నలు చిక్కుముడులలో చిక్కుకుంటున్నాయి" అని కూడా అంటున్నారు. ఈ ప్రతిపాదనలేవైనా ఇప్పుడు వస్తున్న కవిత్వాన్ని ఆధారంగా తీసుకొని చేసినవే. వీళ్ళే ఇంకో చోట–" కవిత్వానికి ఎప్పుడూ ఒకే ఏకసూత్రత వుండదని అది అనేకత్వం వైపు సాగే ప్రవాహశక్తి అనికూడా మేం అనుకుంటున్నాం. ప్రవాహ గుణం లేని కవిత్వాన్ని మేం ఊహించనయినా ఊహించలేం. అలాగే ఒక కవి లేదా రచయిత ఒకే సన్నివేశంలో అనేక అస్తిత్వాలు కలిగి వుండటం కూడా సహజమే అని మేము భావిస్తున్నాం" అంటారు. స్థిరత్వం లేని ఈనాటి మన జీవితాన్ని ఊహించుకుంటే పైన వాళ్లు చెప్పిన అంశాలు ఎంత వాస్తవమో అర్థమవుతుంది సుప్రసిద్ధ కవి, విమర్శకులు దర్భశయనం శ్రీనివాసాచారి కవుల పాత్ర గురించి ఒక చోట" కవి అంటే ప్రత్యామ్నాయ చరిత్రకారుడిలా (Parallel historian)వుండాలంటాను. మన చుట్టూ విస్తారమైన జీవితముంది. రకరకాల మనుషులున్నారు. సుఖాలూ, దుఃఖాలూ వున్నాయి. ఆందోళనలూ, ఉద్యమాలు ఉన్నాయి. వీటన్నింటినీ రికార్డు చేయటం కవి పని" అంటారు. ఇప్పుడు రాస్తున్న కవులూ, వస్తున్న కవిత్వమూ సరిగ్గా ఇదే స్పృహ మీద నిలబడిన సందర్భాన్ని మనం చూస్తున్నాం.

---

## కూనలమ్మ పదాలు

– శ్రీనాగాస్త్ర
**9640317108**

ప్రజలు ఓట్లను పేల్చు
పుచ్చు సర్కార్ చచ్చు
మంచి రోజులు వచ్చు
ఓ కూనలమ్మా

పెరిగే ఇంటి రెంటు
నగరం బయట టెంటు
తప్పదు బతుకు స్టంటు
ఓ కూనలమ్మా

కులము చిల్లుల గొడుగు
మతము నెత్తుటి మడుగు
చరిత పుటలను కడుగు
ఓ కూనలమ్మా

సొల్లు లింగం సెల్లు
బిల్లు చూస్తే ఘొల్లు
నాన్న గుండెకు చిల్లు
ఓ కూనలమ్మా

ప్రజల కోసం సైన్సు
ప్రగతి కోసం సైన్సు
శాంతి కోసం సైన్సు
ఓ కూనలమ్మా



# మాయాబజారు

పరుల మెప్పుకోసం, బతుకును తాకట్టుపెట్టుకున్నపుడే...
నాదికాని తనమేదో నన్నావహించింది !
అలా బతక్కపోతే... నలుగురిలో నామోషితన మనుకున్నపుడే,
ఆ నలుగురికీ నేను దూరమై పోయింది !
నేనేం కొనాలో... నేనేం తినాలో...
ఐనింట్లోంచి రంగులదెయ్యం ఆజ్ఞాపించినపుడే
ఒక పడగనీడలో నేను బతుకుతున్నట్టయింది !
ఊపిరితీయాలన్నా... ఉరి పోసుకోవాలన్నా...
కనిపించని నీడేదో నన్ను నియంత్రిస్తున్నపుడే
చెరువులోంచి టిర్రెలో పడ్డ చేపనై పోయింది !

సిరికి స్వామినాయుడు
9494010330



పదం నాది కాదు ! పలుకు నాది !
భాష నాది కాదు ! యాస నాది కాదు !
కట్టు నాది కాదు ! బొట్టు నాది కాదు !
కనిపించని సంకెళ్లేవో, కట్ల పాముల్లా కాళ్లను చుట్టేసి,
మునివేళ్ల మీంచి ఎగరేసిన పావురాయి రెక్కలు తెగిపోయి,
నా యింటినొక చెరశాల చేసి, నన్ను బంధించి,
పొద్దున్నే తలుపు తెరవగానే పొంగే ప్రకటనల వెల్లువలో....
నేనో ఎండుకట్టెనై కొట్టుకుపోతూ.....!

గవ్వలశెరు పలువరస మీద వేపపుల్ల వెగటైపోవటాలూ,
తూరుపు సన్ని మీద నూరిన
పసుపు ముద్దలు పాలిపోవటాలు,
నుదుట మైదానాల మీద
కుంకుమ రేకుల మందారాలు కుంగిపోవటాలూ,
సనాతన జాతి పరువు సంకేతాలు
చేనేత ఆకాశాలు కూలిపోవటాలూ,
చిట్టెలుకల్లాంటి కోమట్ల చిల్లర కొట్లను
బుసకొట్టిన పాములేవో మింగేయటాలూ,
మనిషి చిరునామా దొరక్క
తొంబై ఊళ్లు తిరిగిన తోకలేని పిట్టలు
సెల్ టవర్ కొమ్మల్లో చిక్కిపోవటాలూ,
ఒకటేమిటి ! మిరుమిట్లు గొలిపే మాయాబజారుల్లో....
అంతా... కళ్లు పొడుచుకున్నా కనిపించని కటిక చీకటి !

కడివెడు దుఃఖమున్నా కడుపారా ఏడవలేని దుస్థితిని
పాడెలా మోస్తున్న చోట –
చివరికింత విషం కొందామన్నా
కార్పోరేట్ గడపతొక్కాల్సిన విషాద సందర్భమేదో ఉనికైన చోట –
మన్నించు మహాకవీ !
దేశమంటే... యిపుడు మట్టీకాదు, మనుషులూ కాదు
మల్టీనేషనల్ కంపెనీ లాగుంది !!

# నిప్పు కణిక

ఆకాశం
తన నిప్పుకంటినింకా తెరవక ముందే
పాముల బుట్టలో నుండి లేచే నల్లతాచులా
మా కట్టెలపొయ్యి నుండి పొగలేచేది !
బూరనూదే పాములోడిలాగా
ఊదురుగొట్టమూదుతూ – అమ్మ !!
పల్చటి పొగమంచులో పైపైకి ప్రాకుతూ
అమ్మ చుట్టూ సుళ్ళు తిరుగుతూ, కళ్ళు మండిస్తూ
బళ్ళో అల్లరిపిల్లోడిలా – పొగ !
అమ్మ మాత్రం
పొంతలో నీళ్ళు కాగేదాకా
అందరి అవసరాలూ తీరేదాకా
పుడకల్నీ, పిడకల్నీ పోగేసి
పొయ్యి పొట్టనిండా కుక్కుతూనే ఉండేది !
పొద్దున పొయ్యి ముట్టించింది మొదలు
రాత్రి బూడిద లోడేసేదాకా
కుటుంబ కుంపట్లో
నిత్యం రగులుతూ ఉండే నిప్పు కణికే –
అమ్మ !!!



- ఎస్.ఎస్.బి. గేరా
9492922492

# ప్రాచీనాంధ్ర కవయిత్రులు - ఓ కొత్త చూపు

ఆచార్య కొలకలూరి మధుజ్యోతి


మొల్ల

ప్రాచీనాంధ్ర కవయిత్రులు చానమ్మ, ప్రోలమ్మ, తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, బాలపాపాంబ, రంగరాజమ్మ, ముద్దుపళని, తరిగొండ వెంగమాంబ, దార్ల సుందరీమణి (భావలింగ శతకం) వంటి వారున్నారు. రచనలు లభ్యం కాని ప్రోలమ్మ, మోహనాంగి, కృష్ణాజీ, మదిన సుభద్రమ్మ, బండి బాపమ్మ, రత్నాంబ, చెలికాని చెల్లాయమ్మ, అమ్మాజీ కవయిత్రులు ఉన్నారు.

తెలుగు సాహిత్య క్షేత్రంలో కావ్యపంటను పండించిన కవయిత్రులలో లబ్ద ప్రతిష్టులుగా తాళ్ళపాక తిమ్మక్క, మొల్ల, రంగరాజమ్మ, ముద్దుపళని, బాలపాపాంబ, తరిగొండ వెంగమాంబలు నిల్చారు. వీరి కావ్యాలు లభించడం సాహితీ జగత్తు అదృష్టం కాగా, మరి కొందరికి ఖ్యాతిని ఆర్జించపెట్టవలసిన కావ్యాలు ఇంకా అన్వేషించవలసి ఉంది.

**1. చానమ్మ, ప్రోలమ్మ :** రణ తిక్కన పత్ని చానమ్మ. యుద్ధ రంగం నుంచి వెన్నుచూపివచ్చిన భర్తను మాటలతో నొప్పించగా, తల్లి ప్రోలమ్మ అతనిలో శౌర్యాన్ని రగుల్లొలిపి యుద్ధోన్ముఖుడిని చేసింది. ఖడ్గ తిక్కన భార్య చానమ్మ కవితావిర్భావ స్ఫూర్తి.

"పగరకు వెన్నిచ్చిన చో
నగరే నిను మగతనంపు నాయకులెందున్?
ముగరాడు వారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్?

అని చానమ్మ అతని మగటిమిని వెక్కిరింపుగా మాట్లాడగా, తల్లి ప్రోలమ్మ

"అసదృశ్యముగ నరివీరుల
పస మీరగ గెలువలేక పందక్రియ నీ
వసి వైచి తిరిగి వచ్చిన
పసులున్ విరిగినవి తిక్కపాలున్ విరిగెన్"

అని ఈసడించింది.

**2. తాళ్ళపాక తిమ్మక్క :** ప్రథమాంధ్ర కవయిత్రి. తాళ్ళపాక అన్నమయ్య ఇల్లాలు. అన్నమయ్య కాలం 1424 –1503. కనుక ఈ కాలానికి చెందినదిగా పరిగణింపబడిన తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కళ్యాణం మంజరి ద్విపదలో రాసింది. దీనిని కావ్యంగా కాక పాటగా తిమ్మక్క పేర్కొంది. సుభద్రార్జునుల కళ్యాణాన్ని హృద్యంగా, సరస శృంగారంగానూ, రచించింది. అద్భుత చమత్కార రచనగా విజయ విలాసాన్ని తీర్చిదిద్దిన చేమకూర వేంకటకవికి ఆకరంగా నిల్చింది, తాళ్ళపాక తిమ్మక్క సుభద్రా కళ్యాణం. చేమకూర ఈమె రచనతో ప్రభావితుడయ్యాడు. అంటేనే నాటికి ఈమె కావ్యం ఎంత ప్రఖ్యాతిని పొంది ఉందో ఊహించవచ్చు.

**3. మొల్ల :** ఆతుకూరి కేసన సెట్టి కుమార్తె, బాల వితంతువు. కుమ్మరి కులజాత. రామలింగని కాలం అని చెప్పే కావ్యాలెన్నో ఉన్నాయి. రామాయణం సంగ్రహంగా రచించింది. 'తిక్కన నిర్వచనోత్త రామాయణము, అయ్యల రాజు రామభద్రుడు, రామాభ్యుదయమును రచించిరి. కానీ విమర్శకులు కవిత్వ శిల్పమున మొల్లకే యనూన గౌరవము నూల్కొలుపజేసిరి' అని పేర్కొంది ఆంధ్ర కవయిత్రులలో ఉటుకూరి లక్ష్మీకాన్తమ్మ (పు. 20)

తెలుగు భాషలో మహా కావ్య రచన చేసిన ఘనత ఈమెదే. తేట తెలుగులో రాసిన పండితురాలు. ఆమె రచనలో పూర్వ రామాయణాలను చదివిన ప్రభావం ఉంది. శబ్దార్థాలంకారాలు ప్రయోగంలో దిట్ట.

"భట్టుమూర్తి ఆడిదము సూరకవి యంతటి వారికి సహితము లోభనీయమైన యనుకరణీయములై నవన, యీయమ పలుకుబడి పసదనమున కేమైన పసదనము లీయవచ్చును"

(ఆంధ్ర కవయిత్రులు, ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, పుట. 21) అంతేకాదు జాతీయాలు నుడికారాలతో రామాయణానికి తెలుగుదనపు రసపుష్టిని అందించింది.

**4. బాలపాపాంబ :** శైవ రచయిత్రి, వీరభోగవసంత వసుమతీశుడి పుత్రిక. ఈమె కాలం క్రీ.శ. 1600. భద్రకాళి భక్తురాలైన ఈమె అక్క మహాదేవి యక్షగానాన్ని రాసింది. వీరశైవమత ప్రచారకుడైన బసవేశ్వర అల్లమ ప్రభువుల సమకాలికురాలు. కన్నడ ప్రాంతాలలో విశేష గుర్తింపు గల భక్తురాలు. వీరశైవ ప్రభావంతో కవిత్వం రాసిన స్త్రీ ఈమె ఒక్కరే. ఈమె యోగ విద్యా ప్రావీణ్యురాలు. ఈ యోగ విద్యా సాధన భక్తి కవయిత్రులలో ఉంది. తరిగొండ వెంగమాంబలోనూ కనిపిస్తుంది.


తరిగొండ వెంగమాంబ

"ఈమె కవిత మిక్కిలి ధారాశుద్ధముగ నుండును. ఈమె రచించిన యక్షగానములో జంపెలు, రచ్చరేకులు, ఏకతాళి మొదలగు దేశి పదములను, జోలపాటలు, మంగళారతులు కలవు." (ఆంధ్ర కవయిత్రులు ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, పు.82) ఇంతటి ప్రజాసన్నిహితత కవిత్వంలో నింపింది.

**5. పసుపులేటి రంగరాజమ్మ :** రంగరాజమ్మ విజయ రాఘవ నాయకుని ఆస్థాన కవయిత్రి. ఈమె రచనలు రామాయణ కథ

మన్నారు దాస విలాసము ప్రబంధము)

మన్నారు దాస విలాసము (నాటకము) యక్షగానము

ఉషా పరిణయము ((ప్రబంధము మొదలయినవి. కాగా అందులో మన్నారుదాస విలాసమునే యక్షగానం బహు ప్రసిద్ధము. విజయరాఘవునికి కాంతిమతికి జరిగిన పరిణయం ఇందలి కథ. తన సమకాలికుడయిన కనుపర్తి అబ్బయామాత్యుడి అనిరుద్ధ చరిత్రం కంటే ఈమె ఉషాపరిణయాన్ని ఉన్నతంగా, ఉత్తమంగా పరిగణించారని ప్రతీతి. ఆమె పాండిత్య ప్రకర్షకు నిదర్శనం విజయరాఘవుడు ఆమెకు చేసిన కనకాభిషేకం. తనను గూర్చి ఆమె గ్రంథాంత గద్యంలో పేర్కొన్నది. సారసారస్వతధురోణయు విచిత్రతర పత్రికా శతలిఖిత వాచకార్థావగాహన ప్రవీణయు, శృంగార రస తరంగిత పద కవిత్వ మహనీయ మతిస్ఫూర్తియు, అతులితాష్ట భాషా కవితా సర్వం కష మనీషా విశేష విశారదయు, రాజనీతి విశారదయు, విజయ రాఘవ మహీపాల విరచిత కనకాభిషేకము, విద్వత్కవిజనస్తవనీయ వివేకము, మహనీయ మహాభారత, భాగవత, రామాయణ కథా సంగ్రహణ విచక్షణయు పసుపులేటి వెంకటాద్రి బ్రహ్మ జన్మతపః ఫలంబును, మంగమాంబాగర్భశుక్తి ముక్తా ఫలంబును' అని తన విశేషజ్ఞతను చాటింది. (ఆంధ్ర కవయిత్రులు ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ పు.62) ప్రేమమూర్తి అయిన రంగరాజమ్మ, విజయ రాఘవుల కథేమన్నారు దాస విలాస కావ్యమనే విషయమూ ప్రచారంలో ఉంది.

**6. ముద్దుపళని :** 18వ శతాబ్దానికి చెందినది. రాధికాసాంత్వనము అనే శృంగార కావ్యాన్ని రచించింది. తిరుప్పావై అనే ముప్ఫై పాశురాలను తెనిగించింది. ఇది భక్తిరస ప్రధానం. సంచలనాత్మక విమర్శనాత్మక రచనగా సాహిత్య చరిత్రలో నిల్చిన రచన రాధికాసాంత్వనము. ఒక స్త్రీ శృంగార సముచితంగా రచన చేయటమే దానికి కారణం. స్త్రీ దైన శృంగార భావాభివ్యక్తి ఉండటమూ కారణం. దీనిని సరిహద్దు మీరిన శృంగారంగా నాడు భావించారు. ఆ కారణాన్నే అది మరుగున పడింది. బెంగుళూరు నాగరత్నమ్మ పూనుకొని దీనిని ముద్రించక (1910) పోతే ఇది ఇంకెన్నాళ్ళు చీకటిలో ఉండేదో?

రాధ, కృష్ణుల సఖ్యత, రాధ, ఇళల ఆత్మీయత, ఇళ, కృష్ణుల శోభనం, రాధ అసూయ విరహం, చిలుక రాయబారం వంటి వివరాలతో వారి స్వభావాలను అత్యంత సమీపంగా చూపిన రచన ఇది. వర్ణనా బహుళ్యంతో మనోభావాల వివరాలతో రచన సారవంతంగా ఉంది. మనో వికారాలను విరహాన్ని తట్టుకోలేని స్థితిని వర్ణించింది.

ఈ రచనలోని రాధ, ఇళలు, మేనత్త అయిన తంజనాయికి, ముద్దుపళని అని, కృష్ణుడు ప్రతాపసింహుడు అని ప్రచారం ఉంది. చమత్కారాలు, సామెతలు అనన్యం. ఎన్నో సామెతలు తన రచనలో పొందుపర్చింది.

"ముద్దుపళనిలో వున్న గొప్ప సుగుణం పాత్ర చిత్రణ, వాళ్ళ మానసిక భావాలు, సంభాషణల ద్వారా, వాళ్ళ స్వగతాల ద్వారా బయటపెడుతుంది. కాని తాను కథనం చేయదు" (ఆరుద్ర, ప్రవేశిక, రాధికా సాంత్వనము పు.15)

**7. దార్ల సుందరీమణి :** భావలింగ శతకం 1833 లో రాసింది. ఈమె శూద్రకులజ, యోగ విద్యాధురీణి, వేదాంత జ్ఞానాన్ని సులభశైలిలో రాసింది. "ఈమె పద్యాల్లో ధారావేగం భావ తీవ్రత రచనాశుద్ధి సరళపద ప్రయోగాలు కన్పిస్తవి.' (ఆంధ్ర కవయిత్రులు, ఊటుకూరి లక్ష్మీ కాన్తమ్మ.పు. 238)

"కటిక వానినైన గాత మొక్క వచ్చును
సోమయాజి ముఖము చూడరాదు
పారుడైనవాడు పశువుల చంపునా
పాప భయ విభంగ భావలింగ "

అంటూ వైదిక కర్మకాండను నిరసించింది. కులభేదాలు, ఉచ్చనీచాలను నిరసించింది.

**8. తరిగొండ వెంగమాంబ :** తరిగొండ వెంగమాంబ వేంకటేశ్వర

భక్తురాలు. 1840 ఆమె కాలం ఈమె లభ్య రచనలు
1. శివ నాటకం
2. రాజయోగ సారము
3. బాలకృష్ణ నాటకము
4. విష్ణు పారిజాతము
5. రమా పరిణయము
6. చెంచు నాటకము
7. శ్రీ వేంకటేశ్వర కృష్ణమంజరి
8. శ్రీ భాగవతము
9. శ్రీ వేంకటాచల మహాత్యము
10. అష్టాంగ యోగ సారం
11. జల క్రీడా విలాసము
12. ముక్తికాంతా విలాసము
13. వాసిష్ట రామాయణము
14. భక్తి గీత సుధ

అలభ్య రచనలు
1. తరిగొండ నృసింహ శతకము
2. నృసింహ విలాసకథ
3. రుక్మిణీ నాటకము
4. గోపికా నాటకము

భక్తి తత్పరత విశేషంగా ఉన్న తరిగొండ వెంగమాంబ యోగాన్ని, వేదాంతాన్ని రంగరించి కావ్య రచన చేసింది. ఆమె కవిత్వం 'అతి మధురం' అని అన్నారు. కందుకూరి వీరేశలింగం, తరిగొండగా ప్రచారమైన ఈమె ఇంటి పేరు తరికుండ అని అనేక మంది పరిశోధకులు పేర్కొన్నారు.

శ్రీ వేంకటేశ్వరుడిని కొలిచిన వెంగమాంబ ఎన్నో జానపద అంశాలు పొందు పర్చింది. "దేశీయ పదజాలము, సమాసాలు, క్రియలు, సంధులు, మాండలిక భాష కారకాలు, ఊనిక, నుడికారము, జాతీయాలు, సామెతలు, లోకోక్తులు బాలబాష, పాత్రోచిత భాష, పాత్రోచిత భాష, వయోచిత భాష, జాత్యుచిత భాషలతో రచనలను పఠన యోగ్యత చేసింది."
------------- (మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ కృతుల పరిశీలన – ఆచార్య కె.జె. కృష్ణమూర్తి పు. 325)

చాలా విప్లవాత్మక స్థితి వెంగమాంబలో చూడగలం. వివాహం వద్దంది, వివాహం అయినా అందులో ఒదగలేదు. భగవదంకితగా తనను తాను పేర్కొంది. భర్త విహీన అయినా, కేశ ఖండనకు అంగీకరించలేదు. పైగా శృంగేరీ ఆచార్యునితో శాస్త్ర చర్చలు చేసి జ్ఞానాన్ని చాటింది. శాస్త్ర జ్ఞానం, కవితా జ్ఞానం స్వీయార్జితమే. యోగ విద్యా సాధకురాలు, వైష్టవ భక్తిని, యోగ విద్యను తన రచనలో నిలిపింది. ముక్తికంతా విలాసం, రాజయోగ సారం రచనలు దీనికి నిదర్శనం.

సాధారణ గిరిజన జీవితాన్ని వారి ఆహార్యాదులను వారి నిర్మల స్వభావాన్ని చిత్రించిన (చెంచునాటకం) భక్తురాలైన వెంగమాంబ సమకాలీన జనజీవనాన్ని కావ్య వస్తువుగా చేసుకొంది. గిరిజన జీవితాన్ని వస్తువుగా తీసుకోవటం ఒక సాహసమే.

మూఢత్వాన్ని నిరసించింది జన జీవితాన్ని సన్నిహితంగా చూసింది. వివాహ సంబరాలను స్పష్టంగా (చెంచు నాటకం,) శ్రీ వెంకటేశ్వర మహాత్మ్యం) పేర్కొంది. నాటి కుటుంబ జీవిత విధానాన్ని పేర్కొంది. గిరిజన జీవితాన్ని – చెంచులు, ఎరుకలు దగ్గరగా చూపించింది.

**2 ఘనత :** కవులది రాజులు దేవుళ్ళ వారి సంబంధ విషయాలతో కవనం సామాన్య జనానికి దూరంగా ఉంటే, కవయిత్రులు ఏమి రాసినా జన సామాన్యాన్ని విస్మరించలేదు. జన హృదయాన్ని స్పందనలను అనుభూతులను హృద్యంగా రచనలలో నింపారు. జన సామాన్యంలో ఉన్న భాష జాతీయాలు సామెతలు నిండారుగా వీరి రచనల్లో కనిపిస్తాయి. ఎంతో ఆంధ్రుల సంస్కృతి ఈ రచనల్లో కన్పిస్తుంది. రంగరాజమ్మ మన్నారుదాస విలాస నాటకం దానికి తార్కాణం. ఆహారం వివాహాది విషయాల ద్వారా నాటి జీవన విధానాన్ని పేర్కొంది. ముద్దుపళని స్త్రీ స్వభావ చిత్రణ అద్భుతంగా తీర్చిదిద్దింది. సాధారణ జన జీవితాన్నే కాక గిరిజన జీవితాన్ని చెంచుల ఎరుకల, జీవితాన్ని వారి ఆహారాన్ని, ఆహార్యాన్ని కుటుంబ సంబంధాలను వారి నైర్మల్యాన్ని తొలిసారి సాహిత్యానికి ఎక్కించిన ఘనత కూడా మొల్లదే. యోగ వేదాంతాది క్లిష్ట విషయాల చర్చను బాలపాపాంబ, దార్ల సుందరీమణి, వెంగమాంబ చేశారు. సాహిత్య కల్పిత సంప్రదాయాలలో పడి కొట్టుకుపోకుండా స్త్రీలు నాటి జీవన భావన స్వరూపాలను వ్యక్తీకరించారు.

**2. భిన్న రస ప్రాధాన్యం :**

ఈ కవయిత్రుల వివిధ రసాలను పోషించారు. ప్రోలమ్మ, చానమ్మల పద్యం లభించింది. ఒక్కొక్కటే అయినా, వీర రసస్ఫూర్తి విస్మరించలేనిది. వారి స్వభావంలో ఉన్న ఆ వీరత్వమే వారి పదునైన పలుకులలో వ్యక్తమయింది. వీరరస ప్రాధాన్యంతో ఆరంభ కవయిత్రులు వ్యక్తీకరణ ఉండటం విశేషాంశం.

**వీరం :** మొల్ల రామాయణం, యుద్ధ వర్ణనలోని వీర రౌద్ర రస భరిత ఘట్టాలు, ఆశ్చర్యాన్ని గొల్పే విధంగా ఉన్నాయి. రాజాశ్రయం లేని ఓ స్త్రీ ఇంతటి విస్తారంగా, వివరంగా యుద్ధాన్ని వర్ణించటం వింతే. యుద్ధ రంగానికి ప్రవేశం లేని స్త్రీ యుద్ధాన్ని దగ్గరగా చూసిందా అన్నంత వాస్తవంగా వీరాన్ని పండించింది.

**శృంగారం :** కవయిత్రులు శృంగార కావ్యాలను రాశారు. మృదువుగానూ, భావుకతతోనూ శృంగారాన్ని పండించారు. సమాజ కల్పిత పరిమితులు స్త్రీలకు ఉన్నాయి. దానిని అధిగమించలేని, అధిగమించటం తెలియని ఒకానొక స్థితిలో ఈ కవయిత్రులు ఉండి రచన చేశారు. సుభద్రా కళ్యాణం రాసిన

తిమ్మక్క మన్నారుదాస విలాసం రాసిన పసుపులేటి రంగరాజమ్మ, ఆ కోవలోనే శృంగారాన్ని రాశారు. కృష్ణభక్తిగా తిమ్మక్క రచన ఉండగా ప్రభువు పట్ల ప్రేమగా రంగరాజమ్మ రచన ఉంది.

వీరి తర్వాత కాలానికి చెందిన ముద్దుపళని రాసిన శృంగార ప్రాధాన్యం గల రాధికా సాంత్వనంతో సంభోగ శృంగారం ఉంది. ఒక స్త్రీ అయి ఉండి అటువంటి రచన చేయటమా? అనే ఆక్షేపణలు వచ్చాయి. దానిలో శృంగారం శృతిమించి ఉందనే విమర్శ ఉంది. సాహిత్య ప్రపంచాన్ని పురుషులు ఏలుతూ ఏం రాసినా ఆనందించే వాతావరణంలో, ముద్దు పళని రాసిన రాధికా స్వాంతనం అప్రియంగా తోచింది. అప్పుడే కాదు. తర్వాతి కాలాలలోను విమర్శకు కారణం అయ్యింది. నిషేధానికి గురి అయ్యింది.

కవయిత్రుల రచనల్లో శృంగారం పోషించబడింది. వీరరస పోషణే కాదు శృంగారం కూడా కవ(యిత్రుల కలం నుంచి జాలు వారింది.

**భక్తి :** వీర శృంగార రసాలు కావ్య జగత్తులో ప్రాధాన్యం గలవే అయినా, భక్తిరస అనన్య ప్రాధాన్యం సంతరించుకొంది. భక్తి ఓ వ్యక్తీకరణ మార్గంగా అయ్యింది. స్త్రీగా సమాజం కల్పించిన హద్దులు, వ్యక్తీకరణ స్వేచ్ఛ లేని స్థితి, స్వేచ్ఛగా సంచరించే అవకాశం లేని వైనం, స్త్రీకి పరిమితిని ఏర్పర్చింది. వీరం ప్రదర్శించే సామర్థ్యం వీరికి లేదు దానిపట్ల లేని అవగాహన వారికి ఒక అడ్డంకిని కల్పిస్తూ ఉండగా, వారికి తెలిపిన శృంగారం కూడా వారికి ఒక హద్దును ఈ సమాజ కల్పిత నియమాలకు లోబడి ఏర్పరిచింది. చెప్పలేనిది వీరం కాగా చెప్పరానిది శృంగారం అయింది. ఈ నేపథ్యంలో కవయిత్రులు సమాజం అంగీకరించిన తత్పూర్వ సాహిత్యం ప్రోది చేసిన భక్తి ఆనవాళ్ళు సంప్రదాయాలు అంది పుచ్చుకొని రాశారు. అదే మార్గం కవయిత్రి మొల్లది. "స్త్రీలు సాహిత్య మార్గంలో తత్పూర్వం లేరు. శూద్రులు లేరు. వైదిక మతం అంగీకరించని విషయం. శైవ ప్రభావం ఉన్న కుమ్మరి కుటుంబపు స్త్రీ అయిన మొల్ల వాటిని ధిక్కరిస్తూ సాహిత్య రచనకు పూనుకొంటూ ఉంది".... సాహిత్య రంగంలో అడుగుపెడుతున్న స్త్రీ నేడు మిమ్మల్ని దాటిపోనన్న హామీ అయినా పురుష సాహిత్య ప్రపంచానికి ఇవ్వటం ఒక అవసరమవుతుంది." (సంప్రదాయ సాహిత్యం స్త్రీ వాద దృక్పథం - కాత్యాయనీ విద్మహే పు. 28) ఆ అవసరమే ఆమె భక్తి మార్గాన్ని ఎంచుకోవటానికి కారణం. భక్తి మార్గాన్ని ఎంచుకొన్న మొల్లది, ఒక విధమైన సంప్రదాయ ధిక్కారం సాహసం కాగా, తరిగొండ వెంగమాంబది మరో రకం. ఈమె బ్రాహ్మణ కులజే అయినా వివాహాన్ని కాదంది. వివాహంలో రాజీపడలేదు. భర్త మరణాంతరం వైధవ్య చిహ్నాలు ధరించటాన్ని వ్యతిరేకించింది ఒంటరిగా జీవించింది. చుట్టూ ఉన్న సమాజాన్ని వస్తువుగా చేసుకొంది. ఈమెది సంప్రదాయ ధిక్కారమే. సాహసమే. ఈ సాహసాల వెనక వారి పోరాటం సామాన్యమైనదీ కాదు. తక్కువదీ కాదు. విప్లవాత్మక అడుగును వేస్తూ, సమాజాన్ని సమాధాన పరుస్తూ, భక్తిని సాహిత్య మార్గంగా ఎంచుకొని వీరు సాగారు. సాహిత్యం వారి భక్తిని చాటే ఋజువుగా ఉంది. వారి పోరాటాలకు సాక్ష్యం లేదు. ఈ మార్గంలో సాగిన మరో కవయిత్రే బాల పాపాంబ.

**వేదాంతం :** భక్తిని రచనల్లో పండించగల కవయిత్రులు వేదాన్ని వేదాంత సారాన్ని, యోగాన్ని, తమ రచనల్లో భాగం చేశారు. భక్తికి తదుపరి దశగా యోగ వేదాంత దశలను భావిస్తే ఆ దశలను ఆ రహస్యాలనూ కూలంకషంగా రచనలలో భాగం చేసి తరిగొండ వెంగమాంబ, దార్ల సుందరీమణులు చర్చించారు.

సంక్లిష్ట భావనా చాతురితో చేసిన వీరి రచనలు వీరి పాండిత్యానికి నిదర్శనంగా ఉన్నాయి.

కవయిత్రులు ప్రాచీనాంధ్ర భాషలో చేసిన రచనలలో వీరాన్ని శృంగారాన్ని భక్తిని వేదాంతాన్ని పోషించి, సమకాలికులలో సమానేతివృత్త రచనలో వారిది పై చేయి అని ప్రశంసలు పొందారు. అది వారి పాండిత్యానికి రచనా మాధురికి నిదర్శనం.

**3. ఎదుర్కొన్న వివక్ష :** వీరంతా ఎన్నో రకాల వివక్షలకు గురయ్యారు, లోనయ్యారు.

**రాజాశ్రయం :** ఒక రచనకు రాజాశ్రయం ఉండటం ఉండకపోవడం అనేది ఇతివృత్తాది కావ్య విషయాలపై ప్రభావం ఉంటుంది. కవయిత్రుల ప్రఖ్యాతిపైనా ప్రభావం ఉంటుంది.

రాజాశ్రయం లేని తిమ్మక్క మొల్ల వెంగమాంబలు దైవసంబంధ కథలను తమ ఇచ్ఛాను సారంగా రాసి ఆనందించారు. కాగా రంగరాజమ్మ ముద్దుపళని వంటి వారు రాజాశ్రయంలో ఉండి ఆదరణ పొంది రాజే నాయకుడైన కథను, రాజుకు నచ్చే కథను రాశారు. వీరు రాజాశ్రయం లేని కవయిత్రుల కంటే స్పష్ట చారిత్రక ఆధారాలను పొందారు. రాజుతో ముడిపడిన చరిత్ర, వ్యక్తులుగా వీరు సాహిత్య లోకంలో నిల్చారు.

'రాజాశ్రయంలో ఉన్న కవయిత్రుల్లో అహంకారం ఆడంబరతలు కన్పిస్తే, రాజాశ్రయం లేని మొల్ల వంటి కవయిత్రుల్లో వినయం, శీలం, సదాచారం కనిపిస్తవి" (భక్తిత్వ కవయిత్రులు ముదిగంటి సుజాతారెడ్డి, తెలుగులో తొలి సమాజ కవులు, కె.కె. రంగ - నాథాచార్యులు పు. 228) మొల్ల వంటి భక్త కవయిత్రుల్లోని గాంభీర్యం స్వచ్ఛత చదువగానే హాయిని కలిగించే గుణాలు రాజాశ్రయంలో వున్న కవయిత్రుల కవిత్వంలో లేవు.

**2. కులం :** రాజాశ్రయం పొందటం ఒక విధమయిన వివక్షకు కారణం కాగా, కులం మరో అడ్డంకి. బ్రాహ్మణుల సాహిత్యానికి తప్ప మరొకరికి స్థానం లేని రోజులలో ఒక స్త్రీ, అందునా బ్రాహ్మణేతర, పైగా శూద్ర కులజ, కుమ్మరి స్త్రీ, మొల్ల సాహిత్య రచనకు పూనుకోవటం, నాటి సమాజంలో ఎంత అలజడి సృష్టించి ఉంటుందో, మొల్ల ఎంత వివక్షకు గురయ్యి ఉంటుందో అంచనా వేయవచ్చు. దార్ల, సుందరీమణీదీ ఇదే కష్టం.

**3. మతం :** మతపరమైన వివక్షా కవయిత్రులపై ఉంది. అధిక సంఖ్యాకులది అయిన వైదిక సంప్రదాయంలో కవయిత్రులకు

# హైకూ సంపెంగలు

మోపిదేవి. రాధాకృష్ణ
9849349516



కొబ్బరి తీరం
కేరళతోరణమై
స్వాగతాంజలి

తానే మల్లెలా
పాపశిగపైదిగి
తెల్లసాలీడు

శశిపరుగు
మేఘాల ఇంద్రజాలం
ఝంఝూమారుతం

వణకే సూది
దారాన్ని బుజ్జగిస్తూ
పండుముదిత

భానుడు మాయం
తాపాన్ని దానంచేసి
గ్రీష్మఋతువు

గాజుల చెయ్యి
గోమయం అలుకుతూ
గుడి ప్రాంగణం

చంద్రుని ఠీవి
గురుశుక్ర నడుమ
నందన చైత్రం

పాపకేరింత
వడగళ్ల 'చే'జార్చి
వాన మెరుపు

పిచ్చుకతోడు
ఈతచెట్టు గూటిలో
ఊగుతూనేను

మట్టి వేషంతో
రంకెలు వేస్తూ గిత్త
వాన తుంపర్లు

లేతఈకలు
గూడు మధ్యమెత్తగా
పక్షిపరుపు

చెట్టంతా పూలు
మకరందం జుర్రేస్తూ
కవి తుమ్మెద

---

ఉన్న పాటి గుర్తింపు శైవ ప్రభావం ఉన్న కవయిత్రికి లేదు. నిజానికి మొల్ల శైవ ప్రభావంతో శైవ మతం స్త్రీలకిచ్చిన ఊతంతో రచనకు పూనుకుంది. కాని ఆమె పట్ల మతపరమైన వివక్ష తక్కువే. దానికి కారణం ఆమె రామభక్తురాలు కావటం, రామాయణం రాయటం. కాని శైవ ప్రభావం ఉండి శైవ రచన చేసిన బాలపాపాంబకు గుర్తింపు చాలా ఆలస్యంగా లభించింది. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, 'ఆంధ్ర కవయిత్రులు' పునర్ముద్రణ సమయానికి బాలపాపాంబ రాసిన అక్కమహాదేవి యక్షగానాన్ని గూర్చి సమాచారం కావ్యం సేకరించి రాసింది. వీర శైవంలో అందునా కన్నడ ప్రాంతాలలో విశేష ప్రాధాన్యాన్ని సంతరించుకున్న శైవ భక్తురాలు అక్కమాంబ కథ ఇది. 1600 కాలపు బాలపాపాంబకు రచనల గుర్తింపు తక్కువ. మొల్ల, బాలపాపాంబలు ఇరువురిలోనే ప్రాచుర్యం గల్గిన, ప్రాచుర్యం లేని రచయిత్రులుగా వారిని గుర్తిస్తే, మతపరమైన వివక్ష సాహిత్యంపై ఎంత ఉందనేది స్పష్టమవుతుంది.

**4. స్త్రీత్వం :** కవయిత్రుల సాహిత్యంపై వివక్ష నీలినీడలకు వారి స్త్రీత్వం ప్రభావమూ ఉంది. స్త్రీ కావటం వలన కొన్ని నియంత్రణలు ఉన్నాయి. అవి మాత్రమే కాదు స్త్రీని సమాజం ద్వితీయ పౌరులుగా చూసినట్టే వారి రచనలకూ ద్వితీయస్థానాన్నే ఇచ్చింది. విషయంగా, ఇతివృత్తంగా కాక ఒక రచనను స్త్రీ రచనగా చూశారు. దీనివలన ఆయా రచనల ఘనత తెరమరుగయిపోయింది.

"స్త్రీల రచనలు నేటికి నిష్పాక్షికంగా చూడబడలేదు అన్నది వాస్తవం. తాళ్ళపాక తిమ్మక్క, ఆతుకూరి మొల్ల, తరిగొండ వెంగమాంబ, ముద్దుపళని వంటి అతికొద్ది మంది స్త్రీలు సాహిత్య సృజనరంగంలో పనిచేశారు. అయితే సమాజంలోని ప్రధాన స్రవంతి సాహిత్యంలో భాగంగా వీరికి పెద్ద గుర్తింపు రాలేదనే చెప్పాలి. సాహిత్య కళా విలువలు లేవని కొన్నింటిని, అనైతిక విషయాలు వ్రాశారని కొందరిని నిర్లక్ష్యం చేయటం జరిగింది." (కాత్యాయనీ విద్మహే, మొల్ల - మొల్ల సృష్టించిన రామాయణ స్త్రీలు, సంప్రదాయ సాహిత్యం, స్త్రీ వాద దృక్పథం, పు.24, 25) అనే మాటలు పై వాస్తవాన్ని స్పష్టపరుస్తూ ఉన్నాయి.

**5. విషయం, అభివ్యక్తి :** రెండూ కూడా వివక్షకు కారణం అయ్యాయి. స్త్రీ శరీరం - మనసు ఆలోచన మాట చేత అన్నీ కూడా సమాజ కల్పిత నియమ నియంత్రణలోనే ఉండాలి. ఉన్నప్పుడే వారికి స్థిమితత, ఈ నియమ నియంత్రణలు స్త్రీ, పురుషులిరువురికీ సమానం, అనటానికి లేదు. స్త్రీలు ఎవరు వానిని అధిగమించినా వారు అతిక్రమణదారులే. "రచనలో కూడా స్త్రీ, పురుష సరిహద్దులను గీశారు. ఒక్కొక్క అభిరుచి ఉంటుంది" (పి. లక్ష్మీ, కవయిత్రుల కవిత్వంలో స్త్రీ మనోభావాలు పు.19) దానిని వ్యక్తం చేసే స్వేచ్ఛ స్త్రీకి లేదు. అలా గీసిన గీటులో రాసిన తిమ్మక్క, మొల్ల, రంగరాజమ్మలకు కలగని ఇక్కట్లు, ఆ గీటులో ఒదగని ముద్దుపళనికి కలిగాయి. కావ్య వస్తువుపై పరోక్షంగానైనా ఉన్న ఈ దుష్ప్రచారం అభివ్యక్తిపైనా ఉండటం శోచనీయం.

**ముగింపు :** ప్రాచీనాంధ్ర కవయిత్రులు భిన్న కాలాలలో, భిన్న మార్గాలలో, భిన్న ఇతివృత్తాలతో సాహిత్య సృజన చేసి సాహిత్య చరిత్ర పొడుగునా తమ స్థానాన్ని ప్రకటిస్తూనే వచ్చారు.

ఈ క్రమంలో ఎన్నో రకాల నియంత్రణలకూ, వివక్షాలకూ గురయ్యారన్నదే చారిత్రక సత్యం. కదలనివ్వని మెదలనివ్వని శృంఖలాలో నుంచి వెలుగు చూసిన సాహిత్య కిరణాలు రచయిత్రుల రచనలు.

ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొని వారి రచనలను పునర్మూల్యాంకన చేయవలసిన అవసరాన్ని 'ప్రపంచ తెలుగు మహాసభలు -2012' సందర్భంగా గుర్తు చేసుకుందాం.



## అడుగులు అంటకాగుతున్నాయి

వడలి రాధాకృష్ణ
998536444

అవును...
ఇక్కడి అడుగులు అంటకాగుతూనే ఉన్నాయి!
విశ్వాంతరాల్లో విహరిస్తూన్న
మనిషి వ్యవస్థ ఇప్పుడు
విశృంఖలమై కూలిపోతూన్నట్లు
తూలిసోలిపోతూ
దాష్టీకానికి దుర్నీతిని జతచేసిన
దృష్ట రాష్ట్ర కౌగిలికి
కొలమానమవుతున్నట్లుంది !!
ఇప్పుడు నీతిని నిలువు పాతరేస్తూన్న కృతక నైజంలో
కాలాలు, కాల్పనికలు కూలిపోతున్నట్లున్నాయి !
విలువను విపరీతం చేస్తూ
అవినీతికి అంబారీలు కడుతూన్న వ్యవస్థ
అధికారమై ఊరేగుతూ
తనను తాను చిదిమేసుకుంటున్నట్లుంది..!
ఇప్పుడు ఒక్క భయం...
జాతి మనుగడే ప్రశ్నార్థకమవుతున్నట్లు
జారుతూన్న ప్రమాణాలు
జారుడు మెట్లతో భీతిల్లుతున్నట్లున్నాయి !
మట్టుబెట్టాల్సిన మహమ్మారి
భూకుంభకోణాలై వెక్కిరిస్తూంటే



ఎర్రకోటను అధిగమించిన సిండికేట్లు ఇప్పుడు...
అవును మరి
పాలకులు పీడితులవుతూ
అనంతాన్ని అనాదితో సమీకృతకం చేస్తూన్నట్లుంది !
పోరు, మూడడుగుల ముందుకు
అరడుల వెనక మధ్య పరిభ్రమిస్తూంటే
విచక్షణ... అధికారం... వ్యవస్థ సౌజన్యాన్ని
అపహాస్యం చేస్తూనే ఉన్నాయి
సేకరణలు కొనుగోళ్ళు...
పారదర్శకత అతి బంధకంగా మారుతుంటే
ఎముకలు లేని చేతులు అధికారమై
అస్మదీయులకు అడ్డాగా మారుతూ
చీకటి చిత్రాలను లిఖిస్తూనే ఉన్నాయి !
చట్టబండలవుతూన్న చట్టం
చిత్తశుద్ధిని చెత్తశుద్దితో సమీకృతం చేస్తూంటే
వేయి బాహువుల అవినీతి
మోచేతి నీరుగా పారి ప్రవహిస్తూనే ఉంటుంది !
మోహనాకృతిగా విరియాల్సిన
వ్యవస్థ తాలూకు అడుగులు అడుగంటుతూ
అంటకాగుతూనే ఉంటాయి.

---

## దండమ్ దశగుణమ్ నభావేత్

కందిపాటి గోపాలరావు
9652174640

పాల సముద్రాన్ని చిలికిన
మందరగిరి కవ్వంలాగా
చిలికి, హలాహలాన్ని
కోకోకోలాగా తాగి
అమృత భాండంగా
నన్ను వెలికి తీసినవాడు.
నేనే తెచ్చిచ్చిన
చింత బరికెల్తో
అరిచేతుల్లో
సూర్యోదయాల్ని మొలిపించినవాడు
చదువుల కల్లంలో



తప్పుల తరకల్ని తూర్పారబడుతూ
గోడకుర్చీలతో
పెద్ద బాలశిక్షైనవాడు
నేడు పసర మొగ్గల్ని
పలుకు తెమ్మెర ఊయలూపాలి
లేత మొక్కలకీ
హక్కులున్నాయని తెలుసుకోవాలి
సిల'బస్' లెక్కి వచ్చేవాళ్ళకి
సరుకు బట్వాడా చేస్తే చాలు
బెత్తమై పోకుండా
జీతబత్తెమై ఉంటే మేలు.

మళయాళీ కథ

# సంగమం



మూలం : లలితాంబికా అంతర్జనం

తెలుగు : డా॥ దేవరాజు మహారాజు

**"నేను పాపిని, తప్పంతా నాదే. నన్ను బహిష్కరించండి. ఫరవాలేదు. కాని, దీనికి కారణం ఎవరూ అని మాత్రం అడక్కండి. దీనికి కారణం ఎవరూ కారు. తప్పంతా నాదే" కులపెద్దల ముందు 'థింగ్' ఆక్రోశించింది. ఆ మాటతో బ్రాహ్మణ పూజారులలో కలకలం బయలుదేరింది.**

"ఛీ ! ఈ స్త్రీ ఎంత నీచమైంది? విధవరాలై ఉండి గర్భిణి అయిందా! పైగా ఎవరి దోషమూ లేదని ఎంతో ధైర్యంగా చెపుతోంది" అని కులపెద్దలు ఆగ్రహించారు.

"ఓసే పాతకీ! నీకు నరకం తప్పదుగాక తప్పదు! ఇప్పుడయినా నిజంచెప్పు!" స్మార్తా మండిపడ్డాడు. మలయాళీ నంబూదిరి బ్రాహ్మణ విధవరాలు ఎవరితోనూ కలవకూడదు. ఎవరితోనూ మాట్లాడకూడదు. దైవధ్యానంలో ఒంటరిగా గడపాలి. ఆమెపై జరిగిన నేరారోపణ తేలిపొయ్యేదాక ఆమెను 'థింగ్' అంటారు. ఆరోపణ నిజమైతే ఆమెను కులం నుండి వెలివేస్తారు. కులపెద్దను స్మార్తా అంటారు. అతడు వేదపండితుడు, జ్ఞాని, నిజానిజాలు గ్రహించి అతడు తీర్పు చెబుతాడు. బ్రాహ్మణ పెద్దలంతా ఉడికిపోతున్నారు. జరిగిన పాపానికి పరిష్కారమేమిటని ఆలోచిస్తున్నారు. అవమానంతో, వేదనతో కుమిలిపోతున్న స్త్రీని గుచ్చి గుచ్చి చూస్తున్నారు. పురుగును అసహ్యించుకున్నట్లు అసహ్యించుకుంటున్నారు.

"మాట్లాడవేమే" మరో గద్దింపు. ఆమె మెల్లగా గొంతు విప్పింది. ఎక్కడో దూరం నుండి మాట్లాడుతున్నట్లు ఆమె మాట పేలవంగా వినిపిస్తోంది.

"అయ్యా! పెద్దలంతా క్షమించాలి. భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. ఈ గర్భానికి కారణం ఎవరో నాకు తెలియదు. ఓపిక నశించిన నా యవ్వనానిదా? ఆహ్లాదకరమయిన ఆ రాత్రిదా? నాలోంచి నిర్భయంగా తలెత్తిన అపరిచితమైన ఉద్రేకాలదా? తప్పెవరిదో నాకు తెలియదు. నేను బాల వితంతువునని అందరికీ తెలుసు. పధ్నాలుగేళ్ళు కూడా సరిగా లేనప్పుడు నా తాళి తెంపారు. అప్పటి నుండి ఈ ఇరవయి ఏళ్లు మచ్చలేకుండా బతుకుతున్నాను. ఒక్కసారయినా ఉపవాసాలు తప్పలేదే? స్నానం, మడి, పూజా పునస్కారాలు తప్పలేదే? తిరువయ్యూర్‌లోను, తిరిప్పన్ ఘాట్‌లోను భగవత్ప్రార్థన తప్పలేదే? మరి ఎందుకిలా జరిగింది? ఆ దయామయుడు, ఆ ఆపత్కాల బాంధవుడు నన్నారాత్రి అట్లా ఎందుకు చేశాడు? కన్నతండ్రితో తప్ప పరపురుషుడితో మాట్లాడి ఎరగనే. మగ వాసనంటేనే నా గుండెల్లోంచి వణుకు పుట్టుకొస్తుందే. మరి

## రచయిత్రి గురించి

అంతర్జనం అంటే నంబూద్రి మహిళ అని అర్థం. కేరళలో నంబూద్రిలది ప్రత్యేకమైన శాఖ. ప్రత్యేకంగా ఛాందస భావాలకు పేరెన్నికగన్నది. వారిలో స్త్రీల జీవితం దుర్భరంగా ఉంటుంది. అలాంటి కుటుంబంలో 1909లో కొట్టవట్టం అనే గ్రామాన పుట్టారు రచయిత్రి లలితాంబికా అంతర్జనం. పండితుల కుటుంబంలో పుట్టినందుకు ఆమె చదువు చిన్నప్పుడు ఇంట్లోనే సాగింది. సాహిత్యం గూర్చిన అవగాహన కూడా ఇంట్లో పెద్దల దగ్గరే దొరికింది. దానితో పాటు నంబూద్రి స్త్రీ సామాజికపరమైన దురాచారాలకు ఎలా గురవుతూ ఉందో ప్రత్యక్షంగా చూడడానికి, అర్థం చేసుకోవడానికి అవకాశం కలిగింది. లలితాంబిక తన రచనా వ్యాసంగాన్ని కవిత్వంతో ప్రారంభించారు. ఆ తరువాత కథ, నవల ఇతర సాహితీ ప్రక్రియలను చేపట్టారు. ఈవిడ రాసిన మొదటి కవిత 1923లో అంటే పద్నాలుగేళ్ళ వయసులో ప్రచురితమైంది.

పెళ్ళికూతురిగా, ప్రేయసిగా, తల్లిగా, గృహిణిగా, కావ్యనాయికగా, ఊహ సుందరిగా, అన్యాయాల్ని ఎదురించే వ్యక్తిగా.... ఇలా విభిన్న కోణాల నుండి స్త్రీలను తన కవిత్వంలో ప్రతిభావంతంగా చిత్రించారు లలితాంబిక. ఈవిడ మొట్టమొదటి కథని 1930లో రాశారు. దాని శీర్షిక 'యాత్రావసంతం'. ఆ కథ తర్వాత ఎన్నో ఇతివృత్తాలతో ఎన్నో కథలు రాశారు. పంచారయుమ్మ ( ఓ తీయని ముద్దు) మూటు పటట్టిల్ (కీడు నీడలో) సత్యత్తింటి స్వరం (నిజం యొక్క గొంతు) కుట్టు సమ్మతం (విధవరాలి ప్రాయశ్చిత్తం) మొదలైన కథలు తొలి రోజులలో రచయిత్రికి మంచి పేరు తెచ్చిపెట్టాయి. ముఖ్యంగా ప్రతీకార, దేవ, స్మర్థవిరం అనే కథలు బాంబుల్లా పేలి నాటి సమాజాన్ని ఒక్క కుదుపు కుదిపాయి.

నంబూద్రిలలో స్త్రీలకు గల హేయమైన స్థానాన్ని ఆ కథలు ప్రశ్నించాయి. అంతర్మథనానికి ఎక్కువ ప్రాముఖ్యాన్నిచ్చాయి. మరీ ముఖ్యంగా అవి జీవిత వైరుధ్యాల్ని, క్లిష్ట సమస్యల్నీ ప్రతిబింబించాయి. లలితాంబికా అంతర్జనం రాసిన ఒకే ఒక్క నవల "అగ్ని సాక్షి" (1977). దానికి అదే సంవత్సరం కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడెమీలు అవార్డులందించాయి. రచయిత్రిగానే కాదు, సాంఘిక కార్యకర్తగా కూడా అంతర్జనం ఎన్నో సంస్థలతో కలిసి పని చేశారు. కేరళ సాహిత్య అకాడెమీకి కొంతకాలం ఉపాధ్యక్షులుగా ఉన్నారు. ఆమె శేషజీవితం కొట్టాయంలో గడిపారు.

ఎందుకిలా జరిగింది? జీవితంలో ఒకేఒక మగవాడి గురించి ప్రతి స్త్రీ తెల్సుకోవాల్సి ఉంటుంది. నా దౌర్భాగ్యం కొద్దీ అలాంటి మగవాడు నాకు లేడు. వంటిల్లే ప్రపంచం. కేవలం అమ్మలక్కల సాంగత్యంలో ఇన్నేళ్లు గడుపుకొచ్చాను. పొరపాటున కూడా ఇంటితలుపు తెరిచి బయటకు చూసింది లేదు. మీరు నమ్మినా, నమ్మకపోయినా ఇదే నిజం. కట్టుబాట్లతో కట్టివేయబడి జీవచ్ఛవంలా బతికిన నా గురించి మీకేం తెలుసు? రానీయండి. అయ్యా-జనమంతా రానీయండి. అందరూ వచ్చాకనే చెబుతా. నన్ను నా బతుకును నడివీధి పాలు చేసిన మనుషులంతా రానీయండి" అంటూ ఎదురు ప్రశ్న వేస్తూ, అతి దీనంగా తన కథను చెప్పుకుంటున్న ఆ స్త్రీ మాటలు ప్రేక్షకులకు శూలాల్లా తగిలాయి. ఒక మామూలు స్త్రీ ఇంత స్పష్టంగా, ఇంత దృఢంగా మాట్లాడడం పూజారులకు, కుల పెద్దలకు ఆశ్చర్యాన్ని కలిగించింది. నిజానికి ఆ ధైర్యం ఆమెది కాదు. అణచివేయబడ్డ ఆమె జీవితంలోని శక్తిది.

"రానీయండి..... అందర్నీ రానీయండి. అప్పటికి పదేళ్ళ పిల్లనైనా నాకు పెళ్ళి నిర్ణయించిన పెద్దలంతా రానీయండి. భర్తగా నిర్ణయించిన పెద్దమనిషికి అప్పటికే ముప్పయ్యేళ్ళ కూతురుంది. ఆమెను మా నాన్న చేసుకున్నాడు. బదులుగా నన్ను ఆ పెద్దమనిషికి అంటగట్టే అవకాశం వచ్చినందుకు మా నానమ్మ చాలా సంతోషించింది. నా కొత్త అమ్మ-అంటే నా భర్త పెద్దకూతురు, ఆరోగ్యం సరిగా ఉండక కొద్ది కాలంలోనే చనిపోయింది. అలాంటి పరిస్థితుల్లో నేను మా నాన్న దగ్గరికి వెళ్లాల్సి వచ్చింది. తొందరగా అత్తవారింటి నుండి విముక్తి దొరికినందుకు చాలా సంతోషపడ్డాను.

నా భర్తను నేను ఒకే ఒకసారి చూశాను. నెరిసిన జుట్టు, కుండలాగా పెద్ద బొజ్జ, వేలాడబడిన కండరాలు. భయం కంటే ఎక్కువ అసహ్యం వేసింది. అతని గదిలోకి నేనెప్పుడూ వెళ్ళలేదు. ముసలమ్మలు అతని దగ్గరికెళ్ళమని, సపర్యలు చేస్తుండమని బలవంతం చేసేవారు. కాని నేను వినేదాన్నికాదు. బయట ఆడుకోవడం ఎంతో ఇష్టంగా ఉండేది. నాకంటే ముందు ముగ్గురిని పెళ్లాడిన నా భర్త, బయట మరో ముప్పయి మందితో తిరగ నేర్చిన నాభర్త, నా గురించి ఆలోచించేవాడు కాదు. చూస్తుండగా రెండేళ్లు గడిచిపోయాయి.

ఓనమ్ పండగకు కొద్ది రోజుల ముందు నా తోటివాళ్లతో వాకిట్లో ఆడుకుంటున్నాను. నాభర్త ఊరి నుండి ఒకమనిషి వచ్చి మా నాన్నగారి చెవిలో ఏదో రహస్యం చెప్పాడు. మా అమ్మ పెద్దపెట్టున ఏడ్వడం మొదలుపెట్టింది. చుట్టుపక్కల వాళ్ళంతా నాచుట్టూ చేరి ముక్కున వేలేసుకున్నారు. నన్ను దగ్గరకు తీసుకుని కళ్ల నీళ్లు పెట్టుకున్నారు. ఎవరో నన్ను ఇంట్లోకి లాక్కెళ్లారు. నిలువునా చన్నీళ్లు గుమ్మరించారు. చీకటి గదిలో కూచో బెట్టారు. గాజులు లాగేసుకున్నారు. బొట్టు తుడిచేశారు. నేనేమీ అనలేదు. నిర్లిప్తంగా ఉన్నాను. ఏడవనైనాలేదు. ఎందుకేడవాలో తెలిస్తేకదా అసలు ! తాళి పట్టుకుని ప్రతిరోజు దేవతార్చన చేసుకోడానికి ఉండాలని గింజుకున్నాను. ఎందరు చెప్పినా విన్లేదు. చివరికి మా నాన్న గారు వచ్చారు. ఎందుకోగాని, ఆయన అనంత దుఃఖ సాగరంలో మునిగినట్లున్నారు. 'పాతదే కదమ్మా ఇచ్చేయ్. నీకు మరో కొత్తగొలుసు పదిరోజుల్లో చేయిస్తాలే' అన్నారు. పిల్లదాన్ని కదా? 'కొత్తగొలుసు' అనేసరికి వదిలేసి గింజుకోవడం మానేశాను. కొత్త గొలుసు వచ్చాక ఎంత సంతోషించానో చెప్పలేను. కర్మకాండ అయిపొయ్యాక ఆ ముతక తాడు పోయి దానిస్థానంలో ధగధగ మెరిసే కొత్త గొలుసు రావడం అదృష్టం అని భావించాను. ఆ తరువాత మా నాయనమ్మ మెల్ల మెల్లగా నాకు పాఠాలు మొదలుబెట్టింది. నేనే బట్టలేసుకోవాలో, ఎవరితో ఎలా

మసలుకోవాలో నేర్పించింది. నేను దీపం గానీ, మంగళసూత్రం గానీ ముట్టుకోగూడదు. కాటుక, కుంకుమ, గంధం వాడకూడదు. ఎల్లప్పుడూ కృష్ణ భగవానుడైన గురవయ్యూర్‌ను ధ్యానించాలి. ఇవన్నీ చెబుతున్న నాయనమ్మను ఒకసారి అడిగాను – 'నువ్వెప్పుడైనా కృష్ణుణ్ణి చూసావా?' అని! దానికామె దీర్ఘంగా నిట్టూర్చి 'నాకంత అదృష్టమటే తల్లీ. మన భట్టాత్తిరి వారు చూశారు. వారు భాగవతం చదివేప్పుడు కనిపించారట. పసుపు పచ్చని సిల్కుబట్టల్తో, నెమలి పింఛంతో ఆ వేణుధారి కనిపించాడటనే! హే క్రిష్ణా.... క్రిష్ణా క్రిష్ణా' అంటూ ఆమె చేతులు జోడించి, కళ్లు మూసుకుని చిరునవ్వుతో దిగంతాలకు చూస్తున్నట్లు, భగవంతుడితో ముఖాముఖి మాట్లాడుతున్నట్లు అమితానందాన్ని పొందింది.

నాకు భట్టాత్తిరిగారి గురించి గాని, వారి భాగవతాపఠనం గురించి గానీ ఏమీ తెలియదు. కాని ఆ గోపికాలోలుని గురించి తెలిసినకొద్దీ మనసు పరవళ్లు తొక్కేది. అలాగే కొద్దికాలం తర్వాత, పూజకు అన్నీ సిద్ధం చేయడం నా బాధ్యత అయ్యింది. తెల్లవారకముందే లేవడం, స్నానం చేయడం, పూల దండలల్లడం, పవిత్ర జలంతో విగ్రహాలనన్నిటినీ కడగడం, నూనెదీపం వెలిగించడం వంటి అన్ని పనులూ చకచకా చేసేదాన్ని. ఎన్నో విగ్రహాలుండేవి కాని అందులో విష్ణుమూర్తి లక్ష్మీ దేవితో ఉన్న విగ్రహం బాగా నచ్చేది. ప్రసన్నతకు ప్రేమకు సంకేతంలా ఉన్న ఆ విగ్రహం ఎంతసేపు చూసినా చూడాలనిపించేది. తన జీవితభాగస్వామి లక్ష్మీదేవిని తొడ మీద కూర్చోబెట్టుకుని, గట్టిగా హృదయానికి హత్తుకుని చిరునవ్వులు చిందిస్తున్న విష్ణుమూర్తి విగ్రహం నాలో ఏదో ఒక ఉద్వేగం కలిగించేది. ఆ విగ్రహానికి ఎంతో శ్రద్ధగా పూలుపెట్టి, గంధం రాసేదాన్ని. అలా చేయడం వల్ల నాలో ఏవో సన్నని కోర్కెలు మొదలయ్యాయి. ఆ పూలు నేనెందుకు పెట్టుకోగూడదు? ఆ గంధం నేనెందుకు రాసుకోగూడదు? కూడదు ! కాలిన నా కలల బూడిద తప్ప నేనేమీ రాసుకోగూడదు.



మా నాయనమ్మ చనిపోయినప్పుడు నా గురించే ఆందోళనపడింది. మా నాన్నతో చివరిగా నా గురించే చెప్పింది – 'అబ్బాయి! నీ కూతురు జాగ్రత్తరా నాయినా దానికీ వయసొచ్చేస్తోంది'. నా గురించి, నా వయసు గురించి ఆమె అంతగా ఆవేదన చెందాల్సిన అవసరం ఏమిటో నాకు అర్థం కాలేదు. సంవత్సరాలు గడిచిపోతున్నాయి. ఉదయ స్నానాలు, పూజలు, భగవన్నామస్మరణతో రోజులు దొర్లేవి. మా అన్నయ్య పెళ్ళిచేసుకుని వదినను తీసుకొచ్చేదాకా నేను కూడా యవ్వనవతినైనా నన్ను విషయం నేను పట్టించుకోనేలేదు. మా వదిన నాకన్నా ఓ ఆర్నెల్లు పెద్దదై ఉంటుంది. రంగు నాకంటే తక్కువే. కాని నాకంటే ఆహ్లాదంగా నవ్వగలిగేది. రంగురంగుల బట్టలు, పూల చీరెలు కట్టేది. అందమైన మడతలతో అవి ఆమె శరీరానికి వింత శోభనిచ్చేవి. జీవితపు దారిలో ఆమె విలాసంగా నడుచుకుంటూ వెళ్తున్నట్టు అనిపించేది. అలాంటి దారి నాజీవితంలో లేదని గుర్తుకు వచ్చినప్పుడల్లా తీవ్రమైన మనోవేదన కలిగేది. ఇక్కడున్న అయ్యావాళ్లంతా, పెద్దలంతా నన్ను క్షమించాలి. క్షమిస్తే ఒక మాట చెబుతాను. ప్రతి సాయంత్రం మా వదిన స్నానం చేసి తలలో పూలు తురుముకున్నప్పుడల్లా నా దౌర్భాగ్యం స్పష్టమయ్యేది. ప్రతి రాత్రి ఆమె తన పడకగది తలుపులు బిడాయించుకున్నప్పుడల్లా నా గుండె ముక్కలయ్యేది.

అయ్యా ! నాయనలూ, బ్రాహ్మణ వంశోద్ధారకులూ వినండి? మీ రేమనుకున్నా సరే నా మనసు మండిపోతోంది. దాన్ని మీ ముందు పెడుతున్నాను. విధవరాలు కన్నీళ్లకు బాధపడదు. ఎదుటివారి నవ్వుకు బాధపడుతుంది. మీ పుచ్చిపోయిన కులాచారాలవల్ల నిండు జీవితాలు ఎలా బలవుతాయో మీకేం తెలుసు?..... మా వదిన విషయం చెబుతున్నాను కదూ... అదే! మా వదిన పూలు పెట్టుకోవడం నాకు భరించరాని విషయంగా ఉండేది. పూజకోసం నేను నాటుకున్న మొక్కల పూలన్నీ ఆమె తెంపుకునేది. నేను ఊరుకునేదాన్ని కాదు. ప్రతిరోజు ఏదో ఒక విషయంలో జగడాలయ్యేవి. నాపుట్టినిల్లన్న ధీమా, గర్వం నాకుండేవి గనక అందులో నేనే గెలిచేదాన్ని. 'నీకెంత కుళ్ళే బోడిదానా? నువ్వు పూలు పెట్టుకోలేకపోతే ఇంకెవరూ పెట్టుకోవద్దా?' అని ఆమె ఈసడింపుగా చూసేది. 'ఇప్పుడెందుకు సమయం రానీ చెబుతా' అని పండ్లు పటపటా కొరికేది.

వృద్ధాప్యం వల్ల నాన్న ఇంటి వ్యవహారాలన్నీ వదిలేశాడు. బాధ్యతలు అన్నయ్య నెత్తిన పడ్డాయి. వదిన పెత్తనానికి వచ్చింది. అలాంటి స్థితిలో విధవరాల్ని, నిస్సహాయురాల్ని అయిన నా పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించండి. నాన్న చనిపోయాక ఇక పుట్టింట్లో ఉండలేక నా భర్త ఊరికి వెళ్ళాను. నా భర్త నాకంటే ముందు ముగ్గురు భార్యాల్ని చేసుకున్నాడు. వారికి ఏడుగురు కూతుళ్లు. వాళ్ళంతా పెళ్లికి ఎదిగారు. అందులో నలుగురు కూతుళ్లు నాకంటే పెద్దవాళ్లు. ఆ గుంపులో నేనూ ఒకదాన్నయ్యాను. అది నా భర్త ఇల్లు గనుక నన్ను వెళ్లగొట్ట గలిగేవాళ్లు ఎవరూ లేరు. నా సవతులు ఏవో సూటి పోటి మాటలనేవారు. నేను పిల్లలులేనిదాన్నని, నాకు దయార్థ్ర హృదయం లేదని హేళన చేసేవారు. నా కసలు దాంపత్య సుఖమే దొరకలేదన్న ఇంగితజ్ఞానం వాళ్లకు లేదు. ఆ దుఃఖంలో నేనూ చాలా కఠినంగా జవాబిచ్చేదాన్ని చెడ్డమాటలువిని, తిట్లు తిని నేను మొండిదాన్నయిపొయ్యాను. నా సవతులకంటే ఒకరకంగా నాపనే హాయిగా ఉండేది. నాకు పిల్లాపీచులేదు గనక బాధ్యతలు కూడా లేవు. చావు వచ్చేవరకు బతకాలి గనక బతకడమే! అంతకుమించి నా జీవితానికి ధ్యేయం, గమ్యం ఏమీలేదు. ఆకలితో, అణగదొక్కబడ్డ కోరికలతో, నిస్పృహతో బతుకుతున్న నా కూతుళ్ల మధ్య నేనూ ఒకదాన్నయిపొయ్యాను.

పేదరికాన్ని ఉపవాసాలతో కప్పి వేసేదాన్ని. విగ్రహం కనిపించినచోట, దీపం కనిపించిన చోట దండం పెట్టేదాన్ని. ఒకసారి వరుసగా పదిహేను రోజులపాటు ఉపవాసం ఉంటే సన్యాసినయ్యానని ఊరు ఊరంతా కదిలింది. మీకు తెలుసు కదా! నా పవిత్రత గురించి, నా నిష్ఠ గురించి, ఎంతో గొప్పగా ప్రచారం చేసిన మీరే ఈ రోజు

నన్ను పాపిని చేసి ఇక్కడ నిలబెట్టారు. నీతికి, నిజాయితికి, సత్సంప్రదాయాలకు సంరక్షకులమని భుజాలెగరేసుకునే పురాణపురుషుల్లారా... ఆలోచించండి ! జీవితమంటే ఏమిటో తెలియని ఒకానొక బాలవితంతువుకు మీరే రక్షణ కల్పించారు? ఈ ప్రపంచం మాయ అని ఇహలోకంలో స్వర్గసౌఖ్యాలు అనుభవించవచ్చని నమ్మించి బతుకుల్ని నరకంలోకి తోసేసే మీరు మనుషులెలా అవుతారో ముందు ఆలోచించండి! హే దేవదేవా... ఓ గురువయ్యూర్ స్వామీ నన్నీ స్థితిలోంచి బయటకు లాగేవారే లేరా? నాకిక విముక్తి లేదా? నా భక్తి, నాఉపవాసాలు, సన్యాసినన్న పేరు ప్రఖ్యాతులు అన్నీ ఏమైపొయ్యాయి? ఏది ఆదుకోదే."

ఆమె కూచుని తన కథ చెబుతున్న గదిలో నుండి వేడి నిట్టూర్పులు వినిపించినయి. అందరూ లోలోన మధన పడుతున్నారు. ఎవరికీ ఏమీ మాట్లాడాలని అనిపించలేదు. ఆమె కదలికను గది తలుపులు తెలియజేసినయి. కొద్ది క్షణాల నిశ్శబ్దం తరువాత ఆమె మళ్ళీ మొదలు పెట్టింది. చెవులు పారేసి వినడం తప్ప, ఆమె వేస్తున్న ప్రశ్నలకు జవాబిచ్చేవారు లేరక్కడ. ఆమెను దోషిగా నిలబెట్టినా, ఆమెకు ఆ దుర్భర జీవితం ప్రసాదించిన దోషులల్లే తలలు వంచుకుని కూచున్నారు.



"అయితే నేనెవర్నీ తప్పు పట్టడం లేదు. ఎలా కావలిసి ఉందో అలా జరుగుతుంది. భాగవతం వినడానికి బ్రాహ్మణ స్త్రీలెందరో గుడికి వెళ్తుంటారు. కాని వాళ్ళందరూ నాలాగే కాలేదు. దేవాలయంలో ఎప్పుడూ ఏదో ఒకటి జరుగుతూనే ఉంటుంది. భజనలు, కీర్తనలు హరికథలు, పురాణపఠనం, ఆధ్యాత్మికోపన్యాసాలు మొదలైన వాటికి స్త్రీలు ముఖ్యంగా బ్రాహ్మణ స్త్రీలు గుంపులు గుంపులుగా వెళ్తారు. అందులో బాలవితంతువులు, భర్త అనురాగం నోచుకోని పడతులు, ఏ కారణాననో పెళ్లికాని యువతులు ఎక్కువ మంది ఉంటారు. దేవాలయానికి వెళ్తే ఎవరూ ఏమీ అనుకోవడానికి ఆస్కారంలేదు. పురాణశ్రవణం కంటె – బాహ్య ప్రపంచాన్ని చూసే అవకాశం దొరికిందన్న ఆనందం నాకు ఎక్కువగా ఉండేది. మగవాళ్ళ కనిపించినా వారి గొంతు వినిపించినా ఎక్కడో నరాల్లో చైతన్యం కలిగేది. మా యింటికి గుడి అట్టే దూరం లేదు. ఆ విషయం మీ అందరికీ తెలుసు. మెప్పత్తూర్‌గానీ, స్వామియార్‌గానీ భగవంతుణ్ని పిలిస్తే చాలు వచ్చి కనబడతాడని మా నాయనమ్మ చెప్తుండేది. 'ఎంతో పుణ్యం చేసుకుంటే గాని వారి మాటలు వినే అదృష్టం కలుగుతుంది' అని కూడా అంటుండేది. అందువల్లనే ఏ స్వామియారైనా భాగవతం చదువుతున్నాడంటే తప్పక వెళ్ళేదాన్ని. పొద్దునే నా పూజా కార్యక్రమం ముగించుకుని గుడికి వెళ్ళేదాన్ని ఇటీవలే వచ్చిన స్వామియార్ అంతకు ముందు వచ్చిన వజ్జుక్కున్నమ్ కంటే కూడా అద్భుతంగా చెబుతున్నాడని అనుభవజ్ఞులు అనుకున్నారు. ఈయన సన్యాసికాదు. ముసలివాడు కాదు, ముప్పయి అయిదేళ్లవాడు. ఆరోగ్యంగా ఉండే నిండైన విగ్రహం. ఆకర్షించే ముఖవర్చస్సు, గంభీరమైన కంఠం, కడిగిన ముత్యంలా ఉండే శుభ్రత, ఎవరెవరికి ఏ స్థాయిలో అర్థం కావాలో ఆ స్థాయిలో అర్థం చేయించగల సమర్థత మొదలయినవన్నీ ఉన్నవాడాయన. పసుపు పచ్చని సిల్కు ధోవతి కట్టుకుని హరే కృష్ణ అని రాసి ఉన్న పంచె నిండుగా కప్పుకునేవాడు. వంకీలు తిరిగిన ఒత్తైన జుట్టుకు, చెవికి మధ్య పూజా పుష్పాలు ధరించేవాడు. జ్యోతి వెలిగించి దాని పక్కనే ఠీవిగా కూర్చుని పుస్తకం తెరిచేవాడు. చదివేదానికి అనుగుణంగా వెలిగించి దాని పక్కనే ఠీవిగా కూర్చుని పుస్తకం తెరిచేవాడు. చదివేదానికి అనుగుణంగా ఆయన కళ్లు వజ్రాల్లా మెరుస్తూ ఉండేవి. ఆడవాళ్లందరూ ఆయనను మళ్ళీ జన్మెత్తి వచ్చిన గోపాలకృష్ణుడని భావించేవారు. ఆయన వాగ్ధాటి గొప్పది. ఆయన గొంతులో సంగీతం ప్రవహించేది. ఆయన మాటల్లో లాలిత్యం, ఆర్ద్రత, ప్రేమ, అర్పణ, సున్నితమైన హాస్యం ఉండేవి. ఆయన మాయాజాలం అమోఘమైనది. ఆయన మాట్లాడుతున్నంత సేపు ఎవరికీ పరిసరాలు గుర్తుండవు. ఇళ్లు సంసారాలు గుర్తుకురావు. గురువయ్యూర్ భగవానుడే సాక్ష్యాత్కరించిన విధంగా ఉండేది. ఆయన బాలగోపాలుడి లీలలు వర్ణించి చెబుతూఉంటే పిల్లల్ని పోగొట్టుకున్న తల్లులు భోరున ఏడ్చేవారు. తల్లులు తమ పిల్లల్లో కృష్ణుణ్ని చూసుకుని తాదాత్మ్యం చెందేవారు.

నా విషయం వేరు. నాకు పిల్లలులేరు. ఉండే అవకాశములేదు. బాలగోపాలుడి లీలలు నన్ను ఆశ్చర్యపరచలేదు. అతడేం చెప్తున్నాడో కూడా వినేదాన్ని కాదు. రాసక్రీడలు సలిపిన ఘట్టం వచ్చేసరికి, చదివి చెప్తున్నతని గొంతులో మార్దవం హెచ్చింది. శ్రోతల్లో ఉత్సాహం పొంగింది. యమునా తీరాన్ని, వెన్నెలను, వేయిమంది గోపికలతో ఉన్న కృష్ణుణ్ని అతను శ్రోతల కళ్ళముందుంచాడు. అతని వర్ణనలకు కన్యలు సిగ్గుతో మొగ్గలయ్యారు. వివాహిత స్త్రీలు చిరునవ్వులు నవ్వుకున్నారు. వయసు మళ్ళినవాళ్లు, విధవరాండ్రు తమ యవ్వనాన్ని గుర్తుకు తెచ్చుకున్నారు. కృష్ణుణ్ని స్మరించుకున్నారు. కానీ నా విషయం వేరు. నాకు ఆశలేదు, అనుభవం లేదు. జ్ఞాపకాలు అంతకన్నా లేవు. అన్నీ విని నా ఆలోచనల్ని, ఊహల్ని, వచ్చే జన్మ కోసం భద్రంగా దాచుకోవడం తప్ప ఏమీ చేయలేను.

అతను రాగయుక్తంగా పాడాడు. భావ యుక్తంగా అర్థం చెప్పాడు. కృష్ణుడు గోపికా వస్త్రాపహరణం చేయడంలో అర్థం వేరే ఉందన్నాడు. రాధ భర్త, పిల్లలతో సంసారం చేస్తూ కూడా ఆ గోపీలోలుడి వేణువు వినిపించగానే ప్రేమవాహినిలో కొట్టుకుని పోయేదని చెప్పాడు. ఈ పాప పుణ్యాలు, ధర్మా ధర్మాలు అన్నీ ఉట్టివే. నడిపేవాడు, నడిపించేవాడు అన్నీ వాడే – అని చెప్పాడు. అనంతమైన విశ్వప్రేమలో మనమంతా పరమాణువులం. ప్రేమే త్యాగం. ప్రేమే పరిష్కారం. ప్రేమే జీవితం. ప్రేమే మానవుడు భగవంతుణ్ని చేరుకోగలగడానికి మూలం. 'ప్రేమ అదృశ్యమైనది! ప్రేమే అనంతమైనది. అది ఏ మాటలకు అందనంత గొప్పది' – అని చెబుతూ ఉంటే నా ఒళ్లు జలదరించింది. తదేకంగా ఆ చెప్తున్నతణ్ని చూస్తూ కూర్చున్నాను. 'ప్రేమే పరిష్కారం, ప్రేమే జీవితం' అంటున్నాడు. దానికి అర్థమేమిటి? నా ఆలోచనలు నన్నే ప్రశ్నించాయి.

దేదీప్యమానంగా వెలుగుతున్న దీపం ముందు కూర్చుని,

తెరచిన పుస్తకం ముందుంచుకుని, అరమోడ్చిన కన్నులతో దైవప్రార్థనలో నిమగ్నమై చేతులు జోడించిన అతడు నిజమైన ప్రేమ మూర్తిలాగా కనిపించాడు. ఒకసారి అతడు పూర్తిగా కళ్ళు తెరిచి గుడి మండపంలో నున్న శ్రోతల్ని శ్రద్ధగా చూశాడు. నేను ముందు వరుసలో కూర్చున్నానని నాకంతదాకా తెలీదు. ఏదో క్రొత్త ఉద్రేకం గుండె లోలోతుల్లోంచి పెల్లుబికింది. అతడు నన్ను చూశాడా? నన్ను, నాచింపిరి వెంట్రుకల్ని, చిరిగిన బట్టల్ని? ఏమో – ఏదో అవ్యక్తమైన అనుభూతి! అది సిగ్గో, జంకో, భయమో ఏదో సరిగా తెలియదు. ఆరోజు సాయంత్రం యింట్లో నా సవతి కూతురు దగ్గరున్న చిన్న అద్దంలో చూసుకున్నాను. ఎప్పుడో చిన్నప్పుడు అద్దంలో మొహం చూసుకున్నట్టు గుర్తు. అంతే! ఆ తరువాత నన్ను నేను అద్దంలో చూసుకున్నది లేదు. ఆ చిన్న అద్దంలో దొంగతనంగా నా ముఖం చూసుకుంటే – నాలో అందం హెచ్చిందని తెలిసింది. కాని ఆ అందంలో విషాదం, నిస్పృహ కొట్టవచ్చినట్టు కనిపిస్తున్నాయి. మాధవుడి వియోగంలో తపించి పోతున్న రాధ ముఖంలాగా అనిపించింది. ఆ మరునాడు స్నానం తర్వాత తల దువ్వుకోవడం అశ్రద్ధ చేయలేదు. విభూదికి బదులు గంధం రాసుకున్నాను. దేవుడి పూలు కొన్ని తీసి తలలో తురుముకున్నాను. తమ పసుపు కుంకుమలు నిలవాలని వివాహిత స్త్రీలు అలా చేస్తారు. ఎప్పటిలాగే నిండా శాలువ కప్పుకుని, తాటి ఆకుల గొడుగు అడ్డం పెట్టుకుని, ప్రాతఃకాలపు పూజ నిర్మాల్య కోసం గుడికి చేరుకున్నాను. ప్రవేశ ద్వారం దగ్గరే ఎవరో సహస్రనామార్చన చేస్తున్నారు. అది సుపరిచితమైన గొంతులాగా అనిపించింది. ఆ గొంతులో ఎంత మాధుర్యం ఉంది? గొడుగు పక్కకునెట్టి అతడిని చూడకుండా ఉండలేకపోయ్యాను. అప్పటికే ఆయన నన్ను ప్రేమగా చూస్తున్నాడు. నా కాళ్ళలో వణుకు, గుండెలో దడ, కళ్ళలో చలనం మొదలయ్యాయి. కళ్లు మసక మసకగా అయ్యాయి. ఆ ప్రభాత సమయంలో అక్కడ ఎంతసేపు నిలుచున్నానో తెలియదు. మందిరం చుట్టూ ప్రదక్షిణ చేయకుండానే వెళ్ళి మండపం చివర్లో కూచున్నాను. ముందు వరుసలో కూర్చోవడానికి ధైర్యం చాలింది కాదు. నాకు తెలియకుండానే నాలో సిగ్గు వింతగా చూస్తున్నారేమోనన్న వింత భావన! ఆ తరువాత్తరువాత నేనేపనిలో ఉన్నా యమునాతీరం – రాధ విరహం – మాధవుడి వేణువు–పసుపు పచ్చని సిల్కు బట్టలు – అరమోడ్చిన కళ్లు – సహస్రనామార్చన – మధురమైన గొంతు – నన్ను ప్రేమగా చూస్తున్న ఎవరివో చూపులు – నన్ను విడిచిపెట్టేవికావు.

మాఘమాసం ప్రవేశించింది. ఉదయాలు చలిలో వణికేవి. నేను లేచి దేవాలయపు చెరువులో స్నానం చేసి, ప్రాతఃకాలపు నిర్మాల్య పూజకు సిద్ధమయ్యేదాన్ని. అట్లా చేస్తే కోర్కెలు సఫలమౌతాయట. నాకేం కోర్కెలున్నాయో స్పష్టంగా నాకే తెలియదు. అయినా చేస్తూ ఉండేదాన్ని. కొద్ది రోజుల క్రితం చెరువులో ఉండగా అవతలి ఘాట్ దగ్గర ఎవరో గొంతెత్తి కీర్తన పాడుతున్నారు. ఆ గానం ఆ ఉదయాన్నే స్పందింపజేస్తూ ఎంతో గొప్పగా ఉంది. నీటిలో సన్నని అలలు కనిపించాయి. నాలాంటి ఏకాకి జీవి ఎవరో ఉదయానికి ముందే స్నానానికి వచ్చినట్లుంది–అని అనుకున్నాను. ఎంత ఆలోచించినా ఆ రోజు అలా ఎందుకు జరిగింది అనేది తెలుసుకోలేకపోతున్నాను.

పూజా సమయం దాటిపోతుందేమో నన్న ఆదుర్దా కొద్దీ ఆ రోజు చెరువుకు పరిగెత్తి వచ్చాను. ఎప్పుడూ వెంట పని మనిషి తోడుగా వచ్చేది. ఆ రోజు రాలేదు. రాత్రి పూసిన పూల పరిమళం చల్లగాలి మెల్లగా చలి చలిగా మోసుకొస్తుంది. చంద్రుడు వాలిపోతున్నాడు. ఘాట్ మీద నల్లని నీడలు దట్టమైనాయి. వెన్నెలకు, చీకటికి మధ్య నా ముందున్న చెరువు – నిశీథ స్త్రీ నిశ్శబ్దపు ఉద్రేకాలకు సంకేతంలాగా పరుచుకుని ఉంది. సాహిత్యం వింటున్నందుకు కాబోలు నా ఆలోచనల్లోనూ కవిత్వం చోటు చేసుకుంటున్నట్లుంది. పరిసరాలన్నీ సుందరంగా కనిపించాయి. యమునానదీ తీరం ఇలాగే ఉండేదేమోనన్న భ్రమ కలిగింది. మరో వైపున పచ్చని చేలు, గోవర్ధన పర్వతాన్ని జ్ఞప్తికి తెచ్చాయి. వీస్తున్న చల్లగాలి రాబోతున్న వసంత చైతన్యాన్ని లాక్కొస్తున్నట్లు అనిపించింది. అందులో ఎన్నో కాలాల్ని, యుగాల్ని దాటి వేణుగానం వినిపిస్తున్నట్లు అనిపించింది. ఆ పరిసరాలకు పరవశించి పోయిన నేను, నాకు తెలియకుండానే అష్టపది పాడాను. అది నేనెప్పుడో చిన్నతనంలో నేర్చుకున్నది. అది నాకింకా గుర్తున్న విషయం కూడా నాకు గుర్తు లేదు.

మానవ స్వభావాలలో కొన్ని బలహీనతలున్నాయి. కాబోలు, కొన్ని కొన్ని సందర్భాలలో ఎంత ప్రయత్నించినా మనల్ని మనం అదుపులో పెట్టుకోలేం. మీరంతా మహామహులు, సత్పురుషులు, ఒక్కోసారి మీరే మిమ్మల్ని అదుపులో పెట్టుకోలేరు. ఇక చెడిపోయిన నాలాంటి మామూలు స్త్రీ విషయం వేరే చెప్పాలా? ఆ విధంగా ఈ ప్రపంచాన్ని మరిచి నా అంతరాంతరాల్లోని స్వాప్నిక జగత్తులో మత్తుగా విహరిస్తున్నపుడు రెండు వెచ్చని చేతులు వెనక నుండి వచ్చి బంధించినయి. భక్తులకు భగవంతుడు దర్శనమిస్తాడని విన్నాము. అయితే అది ఈ విధంగానేనా? నాలో నేను తర్కించుకున్నాను. ఇంతలో నాలోని ఇంగిత జ్ఞానం మేల్కొంది. లేదు... వీల్లేదు. ఈ కలియుగంలో అలాంటి వాటికి ఆస్కారం లేదు. భగవంతుణ్ని ప్రత్యక్షంగా చూసిన అనుభవం ఎవరికి లేదు. మరి వీరెవరు? నా ఆత్మలోలోతుల్లోంచి పెల్లుబికి నిశ్శబ్దంగా గొంతుచించుకుంటున్న ఘోష – నా పెదాల మీద పెట్టబడిన మెత్తని ముద్దులో చల్లబడింది. నా సర్వశక్తులు ఒక గట్టి అలింగనంలో కరిగిపోయినయి. ఉవ్వెత్తున లేచిన ఉక్రోషాల, ఉద్రేకాల అలలన్నీ ఒక తీయని స్పర్శలో కలిసిపోయినయి.

అది కలకాదు. నేను నిద్రపోలేదు. నాకు, ప్రకృతికి జరిగిన మధురమైన తీవ్ర సంఘర్షణలో అందరిలాగే నేను పూర్తిగా ఓడిపోయాను. అంతే. అది పాపమే. అయితే పరిహారానికి నేను దేనికైనా సిద్ధమే! ఆ అనుభవం మళ్ళీ మళ్ళీ చవిచూశానా లేదా మీకు అనవసరం. ఆ భగవంతుడు ఎవరని మీరు అడగొద్దు. నేనుపాపిని, తప్పంతా నాదే... నాదే! తప్పకుండా నాదే! ఇందులో ఎవరి ప్రమేయములేదు."



# స్నేహగీతం

- వలన్‌దాస్ వెంకటేష్
9490508206

నీలి ఆకాశపు వినువీధుల్లో
మేఘాల మేనుపుటుయ్యాల్లో విహరించి
శ్రావణ భాద్రపదపు అమృత ఘడియల్లో
నేలతల్లి నెత్తిన జల్లిన అక్షింతల చందాన
దివి నుండి భువికి చేరిన వాన చినుకు
భూ అంతర పొరల్లో దాగిన అనంతప్రాణి కోటికి
పూనదపు పాణీయ మౌతుంది
అదేపనిగా జలజలమంటురాలే
ధవళ వర్ణపు అక్షింతల హోరులో
పుడమితల్లి తడిసి తడిసి తన్మయత్వంతో పులకరించి
నిండు ముత్తైదువులా ఆకుపచ్చని పరవళ్ళతో
సీమంతానికి సిద్ధం అవుతుంది
నిండు కుండలైన చెరువులు, కుంటలు
విరగ్గాసిన వరికంకులు, కోయిల రాగాలు
పిచ్చుకల గుసగుసలు ఆకాశాన హరివిల్లు తోరణం
వరదగూటి కౌగిటి చత్రబంధంలో వెన్నెలరేడు
చుక్కలద్దిన, చీర చమక్కులా మెరిసే అంబరపు అందం
అవనిపై అమ్మోరు జాతరకళ
అప్పుడు మట్టి వాసన మహిమలో
మనిషి మాధవుడవుతాడు...



మహి పై రాలిన చినుకు చినుకు ఒకటై
వాగులు వంకలు ఏరులా ప్రవాహమై కదలిని ముద్దాడి
జేష్ట ఆషాఢ మాసాన అంబుది నుండి
కౌముది కౌగిలికేగే వాన చినుకు
అర్ధవత్సర బంధంతో ఆత్మీయ కరచాలనం చేస్తూ..
భూమి ఆకాశానికి మధ్య లక్షల వత్సరాలుగా
స్నేహగీతం ఆలపిస్తూనే ఉంది
చిటపట చినుకుల జడివాన

---

# మసిబారిన బాల్యం

- బొద్దూరు విజయేశ్వరరావు
8985079163

స్కూలుకి వెళ్లాల్సిన వయసులో
కూలికి వెళ్తున్న బాలకార్మికుడు వాడు !
బడిలో బెంచీల మధ్యన గడపాల్సిన వాడి బాల్యం
పనిలో రెంచీల మధ్య బిగుసుకుపోయింది !
బాలశిక్షను చదవాల్సిన వాడికి
బాల్యమే శిక్షగా మారిపోయింది !
ఆటపాటలతో అలరించాల్సిన ప్రాయం
చిత్తుకాగితమై చితికిపోయింది !
కార్ఖానాల్లో, పెట్రోలు బంకుల్లో
రెస్టారెంట్లలో, రైల్వేస్టేషన్లలో
సుకుమార బాల్యం మసిబారుతున్నా
అనునిత్యం అలుపెరగని వీరుడై
జీవనపోరాటం చేస్తున్న బాల సైనికుడు వాడు !
అక్షర కిరణాలతో ఉదయించాల్సిన వాడు
కన్నీటి మబ్బుల మాటున అదృశ్యమైపోతున్నాడు !
మమతల తోటలో పరిమళించాల్సిన వాడు
ఆకలివేడికి ఆవిరైపోతున్నాడు !



# పాఠకుని సంస్కార స్థాయిని పెంచే సింగమనేని కథలు

- నందవరం కేశవరెడ్డి
9885120878




"నాగరికుడయిన మనిషిలోని అనాగరిక ప్రవృత్తిని, ఆటవికతని గుర్తు పట్టడమే రచయిత చెయ్యవలసిన పని' అంటారు పాలగుమ్మి పద్మరాజు.

సంస్కారం లేని తనం అనాగరికం. మనిషిలోని జంతు ప్రవృత్తిని, బండవారినతనాన్ని పోద్రొసి, మనిషిని మనిషిగా రూపెత్తించేది సంస్కారం.

"కథలు ప్రధానంగా సంస్కారాన్ని మెరుగుపరుస్తాయి" అంటారు సొదుం రామ్మోహన్.

మనిషి తనలోని అసంస్కృతిక భాగాన్ని గుర్తు పెట్టుకోగలగటానికి కథలు సహకరిస్తాయి.

పువ్వు వికసించినప్పుడే పరిమళిస్తుంది. మనసు సంస్కారవంతమైనప్పుడే మనిషి పరిమళిస్తాడు. సంస్కారమే లేకపోతే సంఘజీవిగా మనిషి మనుగడ సాగించలేదు.

బాహ్యంగా అంతరంగికంగా మనిషిలో సంస్కార స్థాయిని గమనించవచ్చు.

మర్యాద మన్నన మాటతీరు, ఆదరణ సౌజన్యం, ఆర్ద్ర హృదయం ఆత్మీయమైన స్వరం సంస్కార హృదయానికి అభివ్యక్త రూపాలు.

సంస్కారవంతమైన సమాజాన్ని కోరుకుంటూ అలాంటి సమాజాన్నే తన కథల్లో చిత్రించిన కథా రచయిత సింగమనేని నారాయణ.

సింగమనేని గారి కథలు వాస్తవిక జీవితాన్ని మభ్యపెట్టవు. ఒక కుహనా ప్రపంచాన్ని కళ్లముందుంచవు. జీవితం పట్ల అనవసరమైన భ్రమల్ని పెంచవు. పాఠకుల్ని ప్రాక్టికల్‌గా ఆలోచింపజేస్తాయి.

సింగమనేని కథల్లో జీవిత స్పర్శ ఉంటుంది.

వీరి కథల్లోని పాత్రలు, నిశ్చలమూ, గాంభీర్యమూ అయిన సంస్కార హృదయంలో పాఠకుల్ని ఆకట్టుకుంటాయి.

సింగమనేని నారాయణ అనేక కథలు సంస్కార హృదయ పరిమళాల్ని వ్యాపింపజేస్తాయి.

ఒక గతి - ఒక శ్రుతి ఉత్తమ పురుషలో సాగే కథ. కథకుడిలో కథా రచయిత కనిపిస్తాడు.

కథకుడు తన రెండో అబ్బాయికి సంబంధం చూడడం కోసం రైల్లో బయలుదేరుతాడు. ముందు స్టేషన్‌కు దగ్గర్లో ఒక గూడ్స్ బండి పట్టాలు తప్పడంతో కథకుడు ప్రయాణించే రైలు 'చింతకుంట' అనే అతి చిన్న స్టేషన్‌లో ఆగిపోతుంది. ఏ ఐదారు గంటలకు గాని రైలు కదలదు.

చింతకుంట తన చిన్ననాటి స్నేహితుడు గంగాధరం ఊరు అయి ఉంటుందని కథకుడికి స్ఫురణకు వస్తుంది. ఊర్లో విచారించి... వాళ్లు చెప్పిన గుర్తుల ప్రకారం వెతుక్కుంటూ పోయి గంగాధరం ఇంటిని గుర్తుపట్టాడు.

గంగాధారం ఇల్లు పొందికగా ముచ్చటగా ఉంది. ఇంటి ముందు బండలు పాతిన ఒక చిన్న కాంపౌండు. కాంపౌండు మధ్యలో ఒకే రెక్క ఉన్న చిన్న ఇనుప గేటు. గేటుకూ ఇంటికీ మధ్య గల కొద్దిపాటి ఖాళీ స్థలంలో ఒక మునగచెట్టు, రెండు బొప్పాయి చెట్లు, ఒక పెద్ద మల్లె పొదా, నాలుగైదు పూల మొక్కలూ - ఆవరణ ఆకర్షణీయంగా కనిపించింది కథకుడికి.

ఆవరణం ఇంట్లో ఉండే వాళ్ళ మనసును పట్టిస్తుంది.

ఇంటి గదిలో చాపమీద కూచుని ఏదో రాసుకుంటున్న ఓ అమ్మాయి కథకుడిని గమనించి, వచ్చి "మీరు ..." అని ప్రశ్నార్థకంగా అడుగుతుంది.

ఆ అడగటంలోనే ఆ అమ్మాయి మర్యాదా మన్ననలు గమనించవచ్చు.

ఆ అమ్మాయి, కథకుడు తన నాన్న చిన్న నాటి స్నేహితుడని విని, "రండి, లోపలికి రండి నేను వారి అమ్మాయిని" అంటూ కథకుడిచేతిలోని బ్రీఫ్‌కేస్‌ను మర్యాద పూర్వకంగా

అందుకుని ఎంతో ఆదరంతో లోపలికి ఆహ్వానిస్తుంది.

ఆ అమ్మాయి మాట తీరుకు, ఆత్మీయమైన స్వరానికి మనస్సు ప్రఫుల్లమవుతుంది. కథకుడు పులకించి పోతాడు. పాఠకుడు కూడా మురిసిపోతాడు.

ఇరవై రెండు, ఇరవై మూడు ఏళ్ల వయసుతో, పచ్చటి పసిమిఛ్ఛాయ పెద్ద పెద్ద కళ్ళు, సూది మొన ముక్కు గులాబీరంగు చీరలో పొడవాటి జడతో చూడముచ్చటగా వుంది.

ఆ అమ్మాయి కరుణ. బాహ్య అంతఃసౌందర్యంతో ప్రసన్నంగా ఉంది.

కథకుడు ఆ ఇంట్లో అడుగుపెట్టి ఓ గంట కూడా కాకుండానే, కరుణ మాట తీరువల్ల ఆదరణ వల్ల ఆ ఇంటి మనిషై పోయినంత అనుభూతికి లోనవుతాడు. అత్యంత సున్నితమూ, కరుణా భరితమూ అయిన ఆమె కంఠస్వరం కథకుడితో పాటు, సహృదయ పాఠకుల్ని స్పృశిస్తుంది.

కథకుడి మిత్రుడు గంగాధరం, ముగ్గురమ్మాయిల తండ్రి, భార్య దీర్ఘకాల రోగిష్టిగా ఉంటూ, కాలం చేయడం వల్లనూ, ఇద్దరమ్మాయిలకు పెండ్లిండ్లు చేయడంవల్లనూ, ఆర్థిక యిబ్బందులతో కాలాన్ని నెట్టుకొస్తున్న గంగాధరంలో చాలా మార్పు వచ్చింది. కళ్ళలోనూ మునుపటి కాంతి మచ్చుకైనా లేదు. కథకుడి యీడు వాడైనా కథకుడి కంటే నాలుగైదేళ్ళ పెద్ద వాడిలా కనిపిస్తాడు.

సాహిత్యాధ్యయనం వల్ల కాల ప్రభావాన్ని అవగాహన చేసుకున్న హృదయ సంస్కారి గంగాధరం.

ఇరువురు గత స్మృతుల్ని వెలికి తెచ్చుకుంటూ చదివిన పుస్తకాల్ని యిష్టమైన కవుల్ని స్మరించుకుంటారు.

"నేటి హేమంత శైత్యానికి గడ్డకట్టుకున్న నా వెనుక - నాటి వసంత విహారాల జాడులున్న తృప్తి మాత్రం మిగిలి, ఒక్క జీవ కణమైనా రగిలి శాంతిని పొందుతుంది. నా మనస్సు" అంటూ తిలక్ కవిత్వ భాగాల్ని కన్నీటి పొరల మధ్య వినిపించి మనసును ఆర్ద్రం చేస్తాడు గంగాధరం.

జీవితసారం కవిత్వం కదా!

గంగాధరం ఆశ్చర్యపడేలా ఎట్టి కట్నకానుకలూ లేకుండా కరుణను కోడలుగా స్వీకరించడానికి నిర్ణయిస్తాడు కథకుడు.

కాలగతిలో దొర్లిపోయే హృదయాలు, సంస్కార శ్రుతిలో ప్రఫుల్లమవుతాయి. జీవితాలు సార్థకమవుతాయి.

వాసంత తుషారం కథలో వసంత తన స్నేహితురాలు తుషారతో తను చేసుకోబోయే అబ్బాయి యింటికి పెళ్ళి చూపులకు వస్తుంది.

వాసంత తుషారలతో బాటు అబ్బాయి వెంకటపతి, వెంకటపతి అమ్మ వెంకట లక్ష్మమ్మ ఆధునిక భావాల్ని సులువుగా తమలో ఇంకింపచేసుకోగల హృదయ సంస్కారం గల పాత్రలు. వెంకటపతి తండ్రి రామకృష్ణప్ప కూడా పరిస్థితికి అనుగుణంగా కుదుటపడగల మనసున్నపల్లెటూరి రైతు.

తమ అబ్బాయి వెంకటపతిని చూడ్డానికని వసంత, తుషారాతో కలసి వచ్చిందని విని తండ్రి రామకృష్ణప్పకు' అంతా తలకిందులుగా కనిపించినా, తల్లి వెంకట లక్ష్మమ్మ చాలా సంతోషించి, వాసంత తుషారాలను కౌగిలించుకుంటుంది. వాళ్ళను ముఖం కడుక్కొమని చెప్పి, తానే వారి తలల్నిదువ్వింది. జడల్లో మల్లెపూలు తురిమింది.

చాలా చక్కని పని చేసినావు తల్లీ! నా మనసుల్లో ఎప్పుడూ అనుకొనే దాన్ని - చూడు ఎప్పుడూ మగపిల్లలేనా ఆడపిల్లల్ని పెళ్ళిచూపులు చేసేది - ఏం? ఆడపిల్లే వెళ్ళి ఎందుకు చూడకూడదు? నేనూ, మా అమ్మాయీ వెళ్లి మగపిల్లాడి ఇల్లు చూసొస్తాం అంటే అందరూ ఎగిరి గంతులేసినారు తల్లీ కోపంతో - ఇన్నాళ్ళకు నా కోరిక తీరినట్టు నువు వచ్చినావు" - అంటుంది వెంకట లక్ష్మమ్మ వసంతతో.

ఆధునిక భావ హృదయ పరిమళాలతో పరిసరాలు పరిమళ భరితమవుతాయి.

అందరూ పెళ్ళిచూపులకు కూర్చున్నారు.

"ఏమమ్మా వసంతా - మావాడిని ఏమైనా అడుగు తల్లి - ఇంత దూరం వచ్చినావు సిగ్గెందుకు" అంటుంది వెంకట లక్ష్మమ్మ.

వసంత్ తుషారలకు వాతావరణమంతా ప్రఫుల్లంగా కనిపిస్తుంది. మామూలు కుర్రకారుకు భిన్నంగా వెంకటపతి కనిపించాడు వాళ్లకు. ఆ ఇంటి మనుషుల సౌజన్యం వాళ్లను ఆర్ద్రం చేసింది.

వెంకటపతి ఆధునిక సాహిత్యాన్ని చదువుకున్నాడు. గురజాడ, శ్రీశ్రీ, చలం, కొడవటి గంటి, రావిశాస్త్రి, మధురాంతకం వీళ్ళ రచనలంటే వెంకటపతికి చాలా ఇష్టం.

సాహిత్యాధ్యయనం మార్పును తొందరగా ఇముడ్చుకోగల హృదయ సంస్కారాన్ని చేకూర్చి పెడుతుంది.

"మేమిలా వచ్చి పెళ్ళి చూపుల వ్యవహారం నడపటం గురించి మీరేమనుకుంటున్నారు?" అని అడిగింది వసంత చిరునవ్వుతో వెంకటపతిని."

"కొత్త అయినప్పటికీ అసహజమైందే మీ కాదు. నేను చదువుకున్న సాహిత్యం వల్ల ఇది అసాధారణంగా ఏమీ అనిపించలేదు నాకు - మీ ఇంటికి పెళ్లి చూపుల కొచ్చే భారం నాకు తప్పించారు" అన్నాడు వాళ్ళమ్మ లాగే గలగలా నవ్వుతూ.

"ఏ సంగతీ చెప్పి వెళ్ళండమ్మా మా వాడు నచ్చినట్టేనా?" అని వసంత చెక్కిలిని మీటింది వెంకటలక్ష్మమ్మ.

"అప్పుడేనా? అదంతా సస్పెన్స్. మేం ఊరికెళ్లి తర్వాత చర్చించుకొని మీకు ఉత్తరం రాస్తాం" అంది పరిహాసంగా తుషార.

అందరూ ఫక్కున నవ్వితే, వెంకటపతి మాత్రం ముసి

ముసి నవ్వులు ముగ్ధంగా ఒలకపోస్తాడు.

సంస్కార హృదయ సుగంధ పరిమాణాలతో పులకించి పోతాడు పాఠకుడు.

'నిషిద్ధం' -కథలో మమత భాస్కర్‌లకు పెద్దలు పెళ్ళి కుదిర్చారు. ఓ నెలలో పెళ్ళి ఇరువురివి విభిన్న అభిరుచులు గల హృదయాలు.

మమత భాస్కర్‌లు కాఫీ తాగుతూ ఇరువురి యిష్టాయిష్టాలను గురించి మాటాడుకుంటారు.

సీరియల్స్ ఫాలో గావటం చాలా యిష్టమన్న భాస్కర్‌తో, మమత 'సీరియల్స్ నాకు ఇష్టముండ వండీ" అంటూ నెమ్మదిగా చెప్తుంది.

చెప్పిన తీరులో మమత సంస్కార స్థాయిని గమనించవచ్చు.

సీరియల్స్‌లో జీవిత స్పర్శ ఉండదనీ, వాస్తవిక జీవితాన్ని అవి మభ్యపెడతాయనీ' అంటూ 'ఆ రచయితలు సీరియల్స్‌లో ఒక కుహనా ప్రపంచాన్ని పాఠకుల కళ్ల ముందుంచి, జీవితం పట్ల అనవసరమైన భ్రమలు పెంచుతారని' తన దృక్పథాన్ని వివరిస్తుంది మమత.

మమత సాహిత్య అభిరుచుల్లో రచయిత కనిపిస్తారు.

భాస్కర్‌కు ఆమె మాటలు అయోమయంగా తోస్తాయి. అతని హృదయ సంస్కారం అలాంటిది మరి!

భాస్కర్ సాంస్కృతిక స్థాయి మమతను కాస్త కలవర పెట్టినా నెమ్మదిగా చెప్తుంది.

"జీవిత వాస్తవికతను ప్రదర్శించే సాహిత్యం నాకు ఇష్టం మనం జీవిస్తున్న సమాజంలోని ఘర్షణనూ, వాటి మూలాల్నీ వ్యాఖ్యానించే సాహిత్యమే మన పాదాల్ని భూమిని అనేలా చేస్తుంది. వ్యక్తిగత సంస్కారాన్ని పెంపొందించటంతో పాటు సాంఘిక సమస్యల పట్ల మనకర్తవ్యాన్ని నిర్దేశించేదే మంచి సాహిత్యం."

రచయిత, పాత్రలో పరకాయ ప్రవేశం చేసి సాహిత్య ప్రయోజనాన్ని విశదీకరించారు. పాఠకుల్లో ఉత్తమ అభిరుచుల్ని కలిగించడానికి ప్రయత్నించారు.

బస్సులో, స్త్రీలకు కేటాయించిన సీట్లు, పురుషులకు నిషిద్ధమైనా, కూర్చుని, ఓ బాలెంతరాలుకు కూడా సీటివ్వని బండరాయి మనసున్న భాస్కర్‌తో, పెళ్లి నిషిద్ధం అనుకుని, తాను ఎన్నుకున్న జీవితం వైపు అడుగులు వేసిన మమత హృదయ సంస్కారం పాఠకుల్ని ప్రభావితం చేస్తూనే ఉంటుంది.

– – –

'నీకూ నాకు మధ్య నిశీధి' కథలో నేల విడిచి సాము చేయని సుధ కూడా పాఠక హృదయాల్ని ఆకట్టుకుంటుంది.

సురేంద్ర ఫార్మల్‌గా ఆలోచిస్తే, సుధ ప్రాక్టికల్‌గా ఆలోచిస్తుంది. నిశ్చలము, గాంభీర్యము అయిన సంస్కార హృదయం గల సుధ పాత్ర పాఠకుల గుండెల్లో గూడు కట్టుకుంటుంది.

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను సుధగారూ" అని సురేంద్ర చెప్తూనే, ఆ మాటల్ని తీసి పారేసినట్టు మాటాడుతూ సుధ.... నేను ఏ కొత్తగానో పరువంలోకి వచ్చిన ఆడపిల్లనయితే మీ మాట వినగానే మూర్ఛపోవటమో, సిగ్గుతో కొంకర్లు తిరగటమో చేసే దాన్ని" అంటూ శబ్దమొచ్చేలా నవ్వుతుంది.

".... మనం ఆలోచించాల్సింది మనకు ఒకరిపట్ల ఒకరిగల యిష్టాన్ని గురించీ, ప్రేమల్ని గురించీ కాదు – మనం జీవితాన్ని గురించి ప్రాక్టికల్‌గా ఆలోచించాలి. నేను ప్రాక్టికల్ మనిషిని, క్షణికమైన ఆవేశాల్ని ఉద్రేకాల్ని నమ్మను... ప్రాక్టికల్‌గా ఆలోచిస్తే ఈ ప్రేమల కంటే బలీయమైనది జీవిత వాస్తవికత" అంటూ సురేంద్రను ఆలోచనల్లోకి నెట్టి వేసిన సుధను పాఠకుడు మెచ్చుకుంటాడు, జీవితం పట్ల పరిపూర్ణమైన అవగాహన గల హృదయౌన్నత్వానికి ముగ్ధుడు కాకుండా ఉండలేడు.

– – –

ఒక పయనం కథలో ఒక పెద్ద రైతు కరుణా హృదయాన్ని చూస్తాం. ప్రకృతి చేతిలో కృంగి కృశించిన ఓ పేద రైతు కుటుంబాన్ని ఆర్ద్రతతో ఆదుకున్న ఓ చిత్త సంస్కారాన్ని చూస్తాం.

ఐదారు సంవత్సరాలుగా వర్షాలు పడక, తినడానికి తిండి లేక, ఒక స్థాయి గల రైతు గంగన్న, తన కుటుంబంతో కూలి పని చేసుకుని బతకడానికి అనంతపురం దగ్గర నుండి, బళ్ళారి సమీపాన గల కంపిలి కొట్టాలకు వలస పోతాడు.

ఆ ఊర్లో రామప్ప నాయుడు పెద్ద రైతు. అతనికి కాల్వల కింద మాగాణీలో వరి, పత్తి పుష్కలంగా పండుతాయి.

గంగన్న కుటుంబం. రామప్ప నాయుడు ముందు నిలవడినపుడు నాయుడు పలికిన మాటలు గమనించదగ్గవి.

చూడు గంగన్నా! నువ్వు మరీ సిగ్గు పడుతూ నా ముందు నిలబడొద్దు! నా మాదిరీ నువ్వూ రైతువే! మీ అనంతపురం జిల్లా కరువు పరిస్థితులు ఇక్కడ అందరికీ తెలుసు... నువ్వే మీ సంకోచపడొద్దు. ఇక్కడ చేసేన్ని పనులు ఎప్పుడూ ఉంటాయి. మీరంతా మీ సొంత ఇంటిలోలా ఇక్కడ వుండి పొండి.. ఇక్కడ కూడా మీరు రైతుల్లాగే బతకండి! మనందరిదీ రైతు వంశం. మనల్ని మనమే కాపాడుకోవల్ల.... మీ ప్రాంతాలలో పరిస్థితులు చక్కబడగానే మీరు వెళ్ళవచ్చు....."

పచ్చని వరిపైరు మీద నుండి వచ్చిన శీతల వాయువులా నాయుడు సంస్కార హృదయం, గంగన్న హృదయ వేదనను ఉపశమింపజేసి, భవిష్యత్తుపై భరోసాని కలిగిస్తుంది.

మననూను, మననున్న మనిషినీ కాపాడుకోవడానికి సంస్కార స్థాయిని పెంచే సింగమనేని నారాయణ కథలు ఎంతో అవసరం.



# తిలక్ 'అమృతం కురిసిన రాత్రి'

## కవితా సంపుటి - ఒక పరిచయం

శిష్టామాధవి
9949918551




అభ్యుదయ, భావ కవిత్వాల విడదీయలేనటువంటి బంధం చేసిన 'తిలక్' మహనీయుని కలం అమృతం తాగింది. ఇది నిజం. కాకుంటే నిన్న చదివిన కవితకి నిన్నే కాలం చెల్లిపోయే నేటి రోజుల్లో నాలుగు దశాబ్దాల క్రితం రచించబడిన కవితల గురించి నేటికీ చర్చించుకుంటున్నాం అంటే మరి ఆ కలం అమృతం తాగి ఉంటుందంటే అతిశయోక్తి ఏమి ఉంది చెప్పండి?

తిలక్ వంటి మహనీయుని కవితలలోని ఆ భాషా సౌందర్యం, ఆ భావుకతా రమణీయత, ఆ గేయాల్లోని ఆర్తిని పరిచయం చేసి నేటి యువతలో భాష పట్ల, సాహిత్యం పట్ల ఆసక్తిని అనురక్తిని కలుగు జేసే ప్రయత్నమిది.

తిలక్ మొట్ట మొదటి కవిత 'నా కవిత్వం'లో తన కవిత్వమేమిటో, కవిత్వం ఎలా ఉండాలో తెలియచేస్తూ చివరి కవితలో "నా కవిత్వంలో నేను దొరుకుతాను" అంటూ తనతత్వాన్ని తెలియచేస్తూ మనిషితత్వం, మానవత్వం ఎలా ఉండాలో చెపుతారు.

అభ్యుదయ కవితామూర్తికి అనంత భావుకత్వ సోయగాల సొగసులద్దారు తిలక్.

"నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసేదయా పారావతాలు"

"నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు"

అన్న అభ్యుదయ భావాలకి

"నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు"

అన్న భావుక సొగసులద్దారు. వెన్నెలకి, అందానికి, ఆడపిల్లలకి ఎంత అనుబంధము, అన్వయము ఉందో వాటన్నిటికీ, ఆయన కవిత్వాక్షరాలకి అంత అన్వయము, అనుబంధము ఉన్నవి.

ప్రాతఃకాలము అన్న కవితను చూడండి ప్రాతఃకాలపు అందాన్ని పొగడుతూ ప్రాతః కాలానికై ఎదురు చూసేవారేకాక, ప్రాతఃకాలమంటే బెదరేవారు ఉంటారని, వారి బాధల్ని కూడా చిత్రించారిందులో
ఈ కింది వ్యాక్యాలనుచూడండి.

"ఆకలికి మాడుచు వాకిట దిరిగేపేదల
సురిగే దీనుల సుఖసుప్తిని చెరచేసుందర రాక్షసివా !
రుద్ధ జీవుల రుద్ధ కంఠాల రొదలో కదిలెడి ఎదవో
అబద్ధపు బ్రతుకుల వ్యవహారాలకిక మొదలో?"

'సంధ్య' అను కవితలో సంధ్య సౌందర్యం తెలియచేసే శబ్ద సౌందర్యం కనిపిస్తుంది. అర్ధ అంతరార్థాలకై కాకున్నా కనీసం శబ్ద సౌందర్యం తద్వారా భాషా సౌందర్యం ఆస్వాదించవచ్చు దాని ఫలితంగా భాషపై అనురక్తి పెరుగుతుంది.

'వేసవి' అను కవితను చదివినప్పుడు మనం ఏ కాలంలో ఉన్నా క్షణకాలం వేసవిలోకి వెళ్ళిపోతాం అటువంటి వర్ణనది. అందుకే తిలక్‌కు అనుభూతివాది అని పేరు.

'ముసలివాడు' కవితలో అసహాయత, ఆధ్యాత్మికత కలబోసిన కవిత మనలోని మానవీయ విలువల్ని తట్టి లేపుతుంది. జాలి, దయ అనే పదాల విలువను తెలియచేస్తుంది.

'సైనికుడి ఉత్తరం' కవిత అసాంతం మనల్ని కదిల్చివేస్తుంది. సైనికులంతా దేశభక్తితో ఉద్యోగంలో చేరారా, చేరుతారా అంటే సందేహమే కానీ ఉద్యోగంలో చేరాక అంతా దేశభక్తులేనంటే అక్షర సత్యం. ఈ సందర్భాన్నే తెలియచేస్తుందీ కవిత. అంతే కాక ఈ కవిత వ్రాసిన కాలం 1943 కాబట్టి అప్పటి యుద్ధాలు బ్రిటిష్ వారి కోసం చేసినవి కావడంతో ఆ సైనికుడి ఆత్మగ్లాని కూడా ఈ కవితలో ప్రదర్శితమవుతుంది. అందుకే ఇలా వ్రాశారు.

"వన్, టూ, త్రి ఘూట్, డెడ్, ఎవడ్
నువ్వా, నేనా కేబుల్ గ్రాం యిప్పించండి
కేరాఫ్ సో అండ్ సో (మీవాడు డెడ్)
.....................
నేనిదివరకటి నేను కాను
నాకు విలువల్లేవు
నాకు అనుభూతుల్లేవు
చంపడం, చావడం
నేనంటే నాకే అసహ్యం
అందుకే మరీ మరీ చంపుతాను
మరీ మరీ తాగుతాను
ఇంకేం చేసినా ఎవరూ ఒప్పుకోరు"

వాన కురిసిన రాత్రి కవిత, శబ్ద, భావ సౌందర్యాల కలనేత

ఈవాక్యాలు చూడండి.

'చినుకు చినుకుగ వాన కురిసినటు
నిశికి సన్న చీకటి దోమతెర కట్టినటు చలి చలిగా గాలి చెట్ల ఆకుల దూరి
కప్ప బెక బెకల తేలి
చూరులో నిదురతూలి
గుండె కొసలకు మెల్లగా జారినటు....
వెచ్చ వెచ్చని మనసులో పొరలి వచ్చు
నిదురలో చినుకురాలినటు
కలలు జారు సవ్వడి"

ఎంత చక్కని పోలికలు ఎంత హృద్యమైన చిత్రణము. 'పిలుపు' కవిత తిలక్ కవితాత్మను తేట తెల్లంచేస్తుంది.

"ధాత్రీ జనని గుండె మీద
యుద్ధపు కొరకొంచుల ఎర్రని రవ్వలు
మీరెవరైనా చూశారా
కన్నీరైనావిడిచారా
కోటి కోటి సైనికుల ఊడిపడిన
కనుగ్రుడ్ల అద్దాలలో ప్రతిఫలించే నిజాలను
మీరెపుడైనా చూశారా
కాలం విరిగిన బండి చక్రంలా కదలలేకపడిపోతే
మొండి చేతుల మానవత్వం తెల్లబోయిన దీన దృశ్యం
మీరెవరైనా చూశారా
కన్నీరైనా చూశారా
కన్నీరైనా విడిచారా
ముడుచుకున్న కాగితపు గుండెలు చిరిగిపోకపోతే
అణచుకున్న నల్లని మంటలు ఆకాశానికి రేగకముందే
మీరిపుడైనా మేల్కొంటారా
చీకటి తెరలను చీలుస్తారా
ప్రభాత విపంచిక పలికిస్తారా?"

దేశ పరిస్థితిని తెలుపుతూ యువత మేల్కొలుపును కోరుతూ ఆయనిచ్చిన పిలుపు అందుకోను సిద్ధమవ్వండి.

ఆర్తగీతం అనే కవిత 1956లో వ్రాసినది. ఆయన ఆర్తగీతంలోని విషయ చిత్రణలో కించిత్ మార్పుకూడా చేయనవసరంలేకుండా నేటికీ ప్రతి మనసున్న. మానవత్వమున్న మనిషి పాడుకుంటున్న ఆర్తిగీత మది అన్న అతిశయోక్తి లేదు.

'తపాలా బంట్రోతు' కవితలో పోస్ట్‌మాన్‌ని వర్ణించేదంతా ఒక వంతైతే ముగింపు అత్యద్భుతం.

"అందరికీ నువు ఆప్తబంధువువి
అందరికీ నువు వార్తనందిస్తావు
కాని నీ కథనం మాత్రం నీటిలోనే మథనం
అవుతుంటుంది -
ఇన్ని యిళ్ళు తిరిగినా
నీ గుండె బరువుదింపుకోవడానికి ఒక్క గడపలేదు
ఇన్ని కళ్ళు పిలిచినా,
ఒక్క నయనం కోటుదాటి లోపలకు చూడదు
ఉత్తరం యిచ్చి
నిర్లిప్తుడిలాగా వెళ్ళిపోయేనిన్ను
చూచినపుడు తీరం
వదలి సముద్రంలోకి
పోతున్న ఏకాకి
నౌక చప్పుడు."



'వెన్నెల' అనే కవిత చదివినపుడు మిమ్మల్ని తిలక్ ఒక చల్లని వెన్నెల రాత్రిలోకి తీసుకుపోతాడు తన హిప్నోటిక్ పదాల కవితతో. ఆ వర్ణన అనన్య సామాన్యం. వెన్నెల మీద ఇంకా వ్రాసేందుకు ఏమైనా మిగులుందా అని అనిపించేలా ఒకసారి. మరలా చదివితే ఇంత గొప్ప వెన్నెల మీద నేనూ రెండు మాటలు వ్రాయగలిగితే బాగుండునన్న భావన మనలో కదలకమానదు.

"శిశువులాంటి వెన్నెల, నవ వధువులాంటి వెన్నెల..
చచ్చిపోయిన మా అమ్మ తిరిగొచ్చినట్లుంది
స్వర్గంలో ఎవరో సంగీతం పాడుతున్నట్లుంది...
ఈ వెన్నెల నా మనస్సులోకి జారుతోంది
నా గుండె పగుళ్ళ నుండి కారుతోంది...
నన్ను బతికిస్తోంది నా బతుక్కి అందాన్ని, అర్థాన్ని, ఆశని రచిస్తోంది.....
నా రచనగా తానై పోయింది
వెన్నెలవంటి నా ఉద్రేకానికి తెలుగుభాష
శరద్వియది హారవనమై నడిచిపోయింది....
ధనికుల కిటికీ పరదా చిరుసందుల
సురతాలస నిద్రితసతికపోలమ్ముల
జారిన జార్జెట్ చీర జిలుగుటంచుల
చిందెను తెల్లని చల్లని వెన్నెల
చలి రాత్రపు మౌనపు గానపు తెన్నుల"

ఆ చిందిన వెన్నెల చినుకులు తుడుచుకో బుద్ధివేయదు ఎవరికైనా... 'అమృతం కురిసిన రాత్రి' అనే కవితలో నేను ముందుగా చెప్పినట్లు తిలక్ గారు, వారి కలం, యిరువురూ అమృతపానం చేశారు.

"అమృతం కురిసిన రాత్రి అందరూ నిద్రపోతున్నారు
నేను మాత్రం తలుపు తెరచి యిల్లు విడిచి
ఎక్కడికో దూరంగా కొండదాటి, కోనదాటి
వెన్నెల మైదానంలోకి వెళ్లి నిలుచున్నాను
..... జల జల మని కురిసింది వాన
జాల్వారింది అమృతంపు సోన దోసిళ్ళతో తాగివచ్చాను
దుఃఖాన్ని, చావునీ వెళ్ళిపొమ్మన్నాను...
అందుకే పాపం ఈనాటికీ ఎవరికీ తెలియదు
నేను అమరుడనని
అని అంటారు తిలక్
నిజంగా వారు అమరులే ఏనాటికీ....

# నా నేలపై.. ఒక జీవన చిత్రం ... !

- కెరె. జగదీష్

9440708133



అరచేతులతో అభయమిస్తూ బుద్ధుడు నిలబడిన నేలపై
నుదుట మూడోకన్ను అతికించుకుని
రుద్రుడిలా శివమెత్తి ఆడుతున్న జీవశ్చవాలు
గుప్పెడు గింజల కోసం వెదుకులాట
అలసిపోని జూదం - వ్యవసాయం ఈ నేలపై.
మట్టిని దున్నడం, మట్టిలో చేరడం ఒక జీవనచిత్రం
పంటలు పాచికలై ఎప్పుడూ ఓటమే..
ఖాళీకుండల్ని దిగమింగుకుంటున్నా
దబాలున తెరుచుకుంటున్న ఆకలి తలుపులు
పిడచకట్టిన నాలుకపై... బొమ్మ జెముడు
గుడిశె తడికెలోంచి వెక్కిరించే వెలుగులు
రెక్కలొచ్చిన అన్నం మెతుకులై.
నీడలా వెంటపడిన రుణపత్రాలు
బీడుపడ్డ భూముల పొరల్లో మరణపత్రాలై ఖననం.
దేహాలపై ఎడారి నీడలు, వడగాల్పుల వూపిర్లు
చెరువులు నల్లగా, రైతుల కన్నీటి గుంతలు.
పంట భూములు రైతుల శవపేటికలు
విషాదమే ఇక్కడి జీవన విధానం
చావు నిశబ్దంగా, జనాల మధ్య ధీనంగా.
ఇక్కడి మరణాలలో శత్రువు పుట్టుకొస్తాడు
నిష్క్రమణలో ఆవిష్కరణలు
సమాధిలోకి వెళ్ళిన శవాలే వూపిరిపోస్తాయి
ఎడారి సూర్యుడి పాదముద్రలు మండుతూ
నుదుటిపై జీవన రేఖలు.. వంకరగా,
కడుపులో కరువుమంటలు.. నిరంతరం
గొంతులో వూపిరికి నిషేదాజ్ఞలు... బలవన్మరణం
రుణాలవెక్కిరింపులు, మరణమృదంగాలై.
నిటారుగా తెల్లదుస్తుల పెత్తనం.. మేకపోతు గాంభీర్యంలా
పచ్చ 'దనం' మేస్తుంది
చిద్రమవుతున్న బతుకుల మధ్య నిశ్శబ్దం..!

# తలపోత

- వెంకట్



అలల సవ్వడిని గురించి కడలి ఒడ్డున కూర్చుని కవితలల్లుతారు మీరు
అలలను సమీకరించే పనిలో నిమగ్నమవుతాం మేం

నగరాలనొదిలి, గ్రామాలనొదిలి అడవులవైపు తరలిన వసంతాలను చూచి
అడవి అందాలపై పద్యాలనల్లుతారు మీరు

సారవంతమైన నేలలనొదిలి రాతినేలల్లోకి ఇంకిపోతున్న
మా కృషీవలత్వపు వృధా ప్రయాస గురించే మా ఆలోచనలన్నీ

బహుశా మా చివరిక్షణాలలో మా మస్తిష్కాలలోని
ఆలోచనల గురించి ఊహలల్లుతారు మీరు

జీవితపు చివరి క్షణాలలో మిత్రద్రోహాలకన్నా బాధించేది మరొకటుంది
మేమెక్కడ జారిపోయామన్నదే అసలుప్రశ్న

ఉద్యమంలో ఎత్తుపల్లాలను గురించి చెప్పడం తేలికే !
ఎత్తుకెదిగేక్రమం పల్లానికి పదేపదే దారితీయడం గురించే ఆందోళన
ఆర్థిక ఉగ్రవాద భూతం పదే పదే ఆవహిస్తున్న స్థితిగురించే మా ఆలోచన

అమరత్వం రమణీయమైనదనే వ్యక్తావ్యక్తప్రేలాపన
మమ్మల్ని స్టాఫ్లిచ్ యుద్ధవీరుల్ని చేస్తోంది

మా చివరి క్షణాల ఆలోచనలన్నీ ఎక్కడ దారి తప్పామన్న దానిపైనే
చిత్రంగా 'అదే దారని' మా చితిమంటల సాక్షిగా పుంఖానుపుంఖాల రచనలు
మా మృత్యువును వెంటాడుతూ.... వెంటాడుతూ....

---

# అతనికి (ఏం) తెలుసు !?

- అన్నెపు పాపారావు

8897663489



అతనికేం తెలుసు ?
ఆకలితో నకనక లాడుతున్న
బాలకార్మికుడు కోల్పోయిన
బంగారు బాల్యం
అతనికేం తెలుసు?
దళారీల మోసాలతో
జరుగుతున్న శ్రమదోపిడి
అతనికేం తెలుసు?

గుప్పెడు మెతుకుల కోసం
కుత్తుకలెండి, ఎలుగెత్తి
నినాదాలు చేస్తున్న
చిన్నారుల కంఠశోష...
అతనికేం తెలుసు ?
కరెంటు కోతలతో
రైతులు, విద్యార్థుల
సంక్లిష్ట, సందిగ్ధ క్షణాల విలువ..
అతనికేం తెలుసు?
కష్టజీవుల సంపాదనా
సౌందర్యం విలువ..
అతనికేం తెలుసు ?
కానీ....
అతనికి తెలుసు !
డబ్బులు, మందు
పంచితే కొందరు
ఓట్లేస్తారని.
డబ్బుకి లొంగని వాళ్ళకు
కులం, మతం పేర్లు చెప్పి
కామినీ, కాంచనాలతో
వ్యభిచార ముఠా మేస్త్రీగా
యువతను పెడత్రోవ
పట్టించే నైపుణ్యం
తనకుందని.....
అతనికి తెలుసు !
చట్టాన్ని చుట్టంగా
చేసుకుని, రాజ్యాంగం
సందుల నుండి
బయటపడి...
తరతరాలకు తరగని
సంపద దోచుకుపోయే
సత్తా తనకుందని
అతనికి తెలుసు !
కానీ....
ఆకలి కేకలే
అరుణోదయం రేఖలై
అస్త్రాలై, శస్త్రాలై
అంతం చేస్తాయని
అతనికేం తెలుసు ?

## కథ



శాంతి ప్రబోధ
9866703223

# జీవన పోరాటంలో

"నువ్వుంటే బిడ్డకీ గతి పట్టకపోను" అంది పక్కింటి రాజమణి. ఇంకా ఇంట్లోకైనా అడుగుపెట్టని లచ్చమ్మను చూస్తూ.

ఆ మాట వినిపించిందేమో... ప్లాస్టిక్ నులక మంచంపై పడి ఉన్న గంగ కొంచెం కదిలినట్లుంది. అవయవాలు సహకరించక 'అమ్మా...' అని బాధతో గట్టిగా మూలిగింది. ఆ క్షణంలోనే లచ్చుమమ్మ ఇంట్లో అడుగు పెట్టింది.

మొగుడు కొట్టిన దెబ్బలకు ఒళ్ళంతా పచ్చిపుండు అయి కదలలేక మెదలలేక మంచంలో పడిఉన్న కూతుర్ని ఆ స్థితిలో చూసిన లచ్చమ్మకు పొట్టలో పేగుల్ని మెలితిప్పినట్లుగా.. గుండె పట్టేసినట్లుగా అయింది. పువ్వుల్లో పెట్టి పెంచుకున్న బిడ్డ. పచ్చగా ముద్దబంతి పువ్వులాగా ఉండేది. వాడిన మందారంలా అయింది. కూతుర్ని చూస్తున్న ఆమె కళ్ళమ్మట జలధార. మనసు మూగగా రోదిస్తుండగా .. దైన్యంగా చూస్తున్న కూతురి చూపులు ఆ తల్లి మనసుని పిండేస్తున్నాయి.

అరవయ్యోవడిలో ఉన్న లచ్చుమమ్మ ఓ సంస్థ నడిపే ఆశ్రమంలో వంటమనిషి. విషయం తెలియగానే ఉన్న పళాన వచ్చేసింది. తానుపడ్డ కష్టం కూతురు పడకూడదని గారాబంగా పెంచుకుంది. సుకుమారంగా పెరిగిన పిల్ల నేను లేకుంటే ఏమైపోతుందో.. అన్న ఆలోచనే లచ్చుమమ్మకు వెన్నులో చలి పుట్టించింది. తను బిడ్డకి ప్రేమను పంచింది. మనుషుల్ని ప్రేమించడం నేర్పింది. మంచి చెడు తెలిపింది. కాని కష్టం వస్తే దాన్ని ఎదుర్కొనే స్థైర్యం ఇవ్వలేక పోయింది. ఎంతసేపూ నేను పడ్డ కష్టం నా కూతురు పడకూడదు అనుకున్నానే కాని జీవితంలో కష్ట సుఖాలు రెండూ ఉంటాయని వాట్ని మనం ఎదుర్కోవాల్సిందేననీ, గుండెలో ధైర్యం నింపుకోవాలని చెప్పలేదే, మనిషిలో గట్టిదనం నింపలేదే అని మధన పడుతున్న లచ్చుమమ్మకు గతం కళ్ళ ముందు మెదిలింది.

అమ్మగారి ఊరిలో ఐదవ తరగతి చదివింది. ఆరవ తరగతికి పొరుగూరి పెద్ద బడిలో చేరుతానని చాలా గొడవ చేసింది. 'మన ఇండ్లల్ల ఆడిపిల్లకు బడికి పంపుడే గొప్ప. ఇంత దంక సదివిందే మస్తైంది. సాలు.. సాలు.. పొరుగూరికి పంపుతమా'..

సణిగింది నాయనమ్మ. అమ్మ మనస్సులో ఏముందో తెలియదు. కానీ.. నాన్న పక్క ఊరు పంపడానికి అసలు ఇష్టపడలేదు. ఇంటి దగ్గర ఉండి తల్లికి సహాయం చేస్తూ ఇంటిపని వంటపని నేర్చుకొమ్మని హుకుం జారీ చేసాడు తండ్రి. అలా రెండు నెలలు గడిచాయో లేదో మంచి సంబంధం అంటూ రాజమల్లుతో పెళ్ళి. భర్తతో ఏడడుగులు వేసి అత్తింటికి చేరింది చిన్నారి లచ్చుమ్మ. అత్తింటికి చేరిన నెలలోపే వాస్తవం తెలిసింది. తల్లిపోరు పడలేక తనను పెళ్ళి చేసుకున్నానని, ముందే వేరే మహిళతో శారీరక సంబంధం ఉందనీ, వారికి పిల్లలు కూడా ఉన్నారనీ భర్త చెప్పిన మాటలు విని అవాక్కైంది లచ్చుమ్మ. ప్రియురాలితోనే కాలం గడిపే రాజమల్లు డబ్బు అవసరమైతే ఇంటికి వచ్చేవాడు. భార్యను ఏనాడు పట్టించుకోలేదు. మొగుడిని కొంగున కట్టేసుకుని సంసారం చేయడం రాని దద్దమ్మ అని అత్త తిట్టిపోసేది. చిన్నతనం ఏమి చేయాలో దిక్కుతోచని స్థితి. ఓసారి కూతురిని చూద్దామని వచ్చారు లచ్చుమమ్మ తల్లిదండ్రులు. అత్త, ఆడపడుచులు లేని సమయం చూసి తల్లిదండ్రులతో విషయం చెప్పింది. వాళ్ళతో పాటు ఇంటికి వచ్చేస్తానంది తండ్రి ఇంత ఎత్తున లేచాడు. నీ వెనుక నలుగురు ఆడపిల్లలు ఉన్నారు. పిచ్చి పిచ్చి ఆలోచనలు చేయక ఇక్కడే పడిఉండు అన్నాడు. పెళ్లి అయిన ఆడపిల్ల అత్తింట్లనే ఉండాలని తల్లి నచ్చచెప్ప ప్రయత్నం చేసింది. అయినా మారాం చేస్తున్న లచ్చుమమ్మను నీ ఇల్లు ఇదే ఇక్కడే ఉండాలి. నచ్చి నీ మగడు నీ దగ్గరకు వస్తే సంసారం చెయ్యి. లేకుంటే నీ చావు నువ్వు చావు. నీ గాచారం ఇట్లనే రాసి ఉందని సరిపెట్టుకోవాలి అంటూ ఖరాఖండీగా చెప్పాడు తండ్రి. తల్లి బిడ్డ పరిస్థితికి ఏడ్చింది కానీ భర్తకు ఎదురు చెప్పి తమతో తీసుకెళ్ళే ధైర్యం చేయలేదు.



లోకం పోకడ తెలియని లచ్చుమమ్మ తండ్రి మాటలకు చిగురుటాకులా విలవిలలాడి పోయింది. చాలా బాధపడింది. చనిపోవాలని అనుకుంది. కానీ, నేనేం తప్పు చేశాను? నేనెందుకు చనిపోవాలన్న ప్రశ్న ఉదయించి ఆమెను చావనీయలేదు. ఇక ఎప్పుడూ ఆ దిశగా ఆలోచించ లేదు.

అంతకు ముందెప్పుడూ పొలం గట్టెక్కని ఆమె పొలం వెళ్ళడం, వ్యవసాయ పనులు చేయడం నేర్చుకుంది. అరకు దున్నడం, నాటేయడం, కలవడం, కోయడం అన్ని పనులూ అత్తమామలతో కలసి చేసేది. తన తిండి కోసం ఏనాడు భర్తపై ఆధారపడలేదు. మొగవాడిని, మొగుడిని అని అడిగినప్పుడు పైసలు ఇవ్వకపోతే ఆమెను కొట్టేవాడు. ఉన్న పైసలు లాక్కుపోయేవాడు. నా బతుకు ఇంతే.. నా మీద మనసు లేదు. ప్రేమ లేదు. అచ్చట ముచ్చట ఏం లేదు. కానీ, నేను సంపాదించిన పైసలు కావాలి. అందుకోసం నేను పెండ్లాన్నని అనుకుంటడెమో అని బాధపడేది. పిల్ల జెల్ల లేరు. "ఏం జేస్కుంటవ్ పైసలు" అని ఎత్తి పొడుపు ఆమెను చాలా బాధించేది.

పనిలో ఉన్నంతసేపు తెలిసేది కాదు కానీ.. ఒంటరిగా ఉన్నప్పుడు ఒంటరితనం చాలా నరకం చూపేది. ఒక్కోసారి తనపై తనకే కోపం.. కసి.. ఆరోగ్యం పాడైంది.

అదే సమయంలో తమ్ముడి భార్య కానుపు కష్టమై చనిపోయింది. పుట్టిన పసిగుడ్డని తెచ్చి తల్లి అయి పెంచింది. పెద్ద దాన్ని చేసింది. బంధువుల అబ్బాయికి ఇచ్చి పెళ్ళి చేసింది. ఇల్లరికం తెచ్చుకుంది. అప్పటికే భర్త చనిపోయాడు. బొట్టు, గాజులు, పూలూ దూరమవడం తప్ప మరే మార్పు లేదు ఆమె జీవితంలో.

పెంపుడు కూతురికి ఇద్దరు ఆడపిల్లలు. అంతా కష్టం చేసి పిల్లల్ని పెంచుతూ ఆనందంగా గడుపుతున్నారు. రెక్కల కష్టం మీద ఎకరం పొలం సంపాదించుకున్నారు. అత్త ఇచ్చిపోయిన ఇల్లు ఉంది.

కొన్నాళ్ళకి సావాసగాళ్ళతో చేరి అల్లుడు మద్యానికి బానిసయ్యాడు. సరిగ్గా పని చేసేవాడు కాదు. ఎక్కడెక్కడో తిరిగి వచ్చేవాడు. అతని వ్యవసనాలకోసం పైసలు ఇవ్వమని తరచూ భార్యని కొట్టేవాడు. ఆ తర్వాత జబ్బు చేసింది. వైద్యం కోసం పొలం కుదువపెట్టి 80 వేలు ఖర్చు చేసింది.. చివరకూ హెచ్.ఐ.వి ఎయిడ్స్ అని తేలింది. కష్టాల చీకటి పోయి కూతురుతో వెలుతురు వచ్చిందని సంబరపడిన ఆమెను అల్లుడి రోగం అతలాకుతలం చేసింది. అగాధంలోకి తోసినట్లైంది. కూతురి జీవితం గురించి బెంగపడింది. ఎవరెవరినో ఆశ్రయించి చివరకు అల్లుడిని ఓ చర్చి ఆధ్వర్యంలో నడిచే హాస్పటల్లో చేర్చింది.

పొలం పనులు చేసే ఓపిక లేదు. కానీ పని చేయాలి తప్పదు. తన కోసం తన కూతురు కోసం.. ఆమె పిల్లల కోసం.. అందంగా ఉండే కూతురు బయటి పనులకు వెళ్తే కంది పోతుందనుకుంది. మీద పడే వయస్సు సహకరించకున్నా తానే వంట మనిషిగా మారింది. పొరుగూరిలో పనిచేస్తూ పైసా పైసా జమ చేస్తోంది. కూతురి కుటుంబం కోసం చేసిన అప్పు తీర్చడం కోసం.

అల్లుడు హాస్పిటల్లో ఉండనని వాళ్ళతో గొడవ పెట్టుకుని ఇంటికి వచ్చేశాడు. తాగుడు, వ్యసనాలకు బానిసైన అల్లుడు, మాయదారి రోగం బారిన పడిన అతడు తన భార్య కోరిక తీర్చలేదన్న కసితో "నేను నీ మొగుడిని కానా.. మొగాడినా కానా..?



పిల్లల్ని ఎవరికీ కన్న వే.. దొంగలం..'' అంటూ బూతులు తిడుతూ ఇంట్లో ఉన్న టి.వి. ఎత్తేశాడు. బిందెలు, గిన్నెలు.. వంట సామాగ్రి గిరాటేశాడు. "నన్ను హాస్పిటల్లో పడేసి ఎవర్ని మరిగావే..'' అంటూ భార్యను చితకబాదాడు. అడ్డుకున్న పిల్లల్నీ తన్నాడు. పన్నెండేళ్ళ పెద్ద కూతురు తన తల్లిని తండ్రి పెడ్తోన్న హింసనూ చూడేలేక పోలీస్ కేసు పెడతానంటూ వెళ్తోంటే ఆమెను ఈడ్చి పడేశాడు. భార్య ఒంటి మీద ఉన్న పుస్తెలు, చెవి పోగులు లాక్కొని వెళ్ళిపోయాడు.

కూతురికి ఆ మాయదారి రోగం ఎక్కడ అంటుకుంటుందోనని తల్లడిల్లిపోతున్న లచ్చుమమ్మ వొళ్ళంతా దెబ్బలతో వాచిపోయి, కమిలిపోయి ఉన్న గంగను చూస్తే బాధగానూ, భయంగానూ ఉంది. కూతురు ఏమవుతుందోనన్న ఆందోళన ఆమెకు ఊపిరి ఆడనివ్వడంలేదు. అంత చల్లటి వాతావరణంలోనూ ఆమె వొళ్ళు చెమటతో తడచిపోయింది.

లచ్చుమమ్మ రాకను గమనించిన ఇరుగుపొరుగు తమ పనులు ఆపుకుని వచ్చారు.

"అమ్మమ్మా...'' అంటూ ఏడుస్తూ లచ్చుమమ్మను చుట్టేశారు మనుమరాళ్లిద్దరూ.

"ఏందే అదినే బిడ్డని గిట్ల ఆగం పట్టిపిస్తివి. నువ్వీడ ఉంటే ఆ ముం...కొడుకు గిట్ల జెసునా..'' చేతులకున్న తడి కొంగు తీసి తుడుచు కుంటూ ఒకరు అంటే

"ఏదో ఇంత పైసా పోడావు చేస్తానని పోతివి.. ఏమయ్యింది... సూడు'' అని దీర్ఘం తీసింది ఒకావిడ.

గంగ మూలుగు విని "ఇంక నయ్యం గంగవ్వ పానం పోలే.. పోరాగాల్లకు గోస గోస ఐతుండే'' అని ఎదురింటావిడ.

"ఎందోనే ఆనికి దెయ్యం పట్టింది గందుకే గిట్ల చెయ్యవట్టిండు'' అన్నది మఱో స్త్రీ మొహమంతా చిట్లించుకొని.

"నువ్వేమన్నా అనుకోయే సిన్నీ నాకయితే ఆలమ్ది కొడుకుని... ఏదోటి చెయ్యాల్నే'' అంది తన కసి కోపం అంతా పక్కనున్న జామ చెట్టు కొమ్మ విరవడంలో కన్పిస్తుండగా.

"ఆని వోఱ్రుడికి ఏమయితాందని అస్తి.,, ఆరి ఏందిరా.. అంతగనం కొట్టవడ్తివి. బక్క పోరి సస్తదిర అని ఆడ్ని ఆపబోతే.. ఒసే.. ముసిల్దానా.. నువ్వేవత్తివే. మా నడుమస్తున్నావ్. నా పెండ్లం నా ఇష్టం తంతా.. సంపుత.. అనుకుంట దాన్ని గోడకేసి కొట్టుడు కొడ్తాంటే నా పానం పోయినట్టయ్యే.... నన్నేడ కొడతాడో..నని అనుంట జర్గితి'' అంటూ జరిగిన సంఘటన గురించి చెప్పుకుపోతోంది లచ్చుమమ్మకు వరుసకు అత్త అయ్యే ముసలమ్మ.

"అంత ఆడిని ఆడిపోసుకుంటున్నరు. ఇది ఏమనకుస్టనే గిన్ధగనామ్ కొడ్తడా..'' ముక్కులో నశ్యం పీల్చుకుంటూ ఒకామె.

"ఆనిల మన్నువడ గా బీమారి ఐన కాడి కెల్లి ఆడు ఏదోటి గట్టనే పెండ్లాం తోటి కయ్యమాడుదు గొడ్డును కొట్టినట్టు కొట్టుడు.. ఇయ్యాల్ల ఇంకొంచెం ఎక్కువాయె.'' గొనిగింది ముసలమ్మ

"సిన్నీ ఆడిని ఒదలొద్దె ఇయ్యాల్లతోని ఆగుతదా.. ఈన్ని జూసి ఇంకొకడు గిట్లనే జేస్తడు. ఆల్లకు అన్ని జేసుడే ఎక్కువనుకుంటే ఇంక తన్నులు, గుద్దులు.. ముల్లులోలె గుచ్చుకునేటి మాటలు.. ఇట్లా ఎన్నొద్దులు ఒర్వాల్నే..'' పక్కింటి ఇల్లాలు.

"అదినే..గీ అయిసు పోరగాండ్లు గిట్లనే అంటరు.. నువ్వెన్ని కష్టాలు పడ్తివి. ఎంత గుట్టుగ, పరువుగ బతికితివి. గుట్టుగా కాలం నడిపితివి. ఈన్ని టానలు ఎపిస్తే.. ఇగ నువ్వు బజారున వడ్డట్టె..'' హెచ్చరికగా.. ఒకావిడ

"పెండ్లాము మొగని కోర్కె తీర్చేది లేదా.. కాదంటె గిట్లనే ఉంటది'' గంగనే తప్పుపడ్తున్నట్లుగా ఒకరు అంతా తమకు తోచిన విధంగా మాట్లాడుతున్నారే గానీ లచ్చుమమ్మ నోరు తెరచి ఒక్క మాటా మాట్లాడలేదు. ఎవరికీ సమాధానం చెప్పలేదు. మౌనంగా రోదిస్తూనే అందరి సలహాలూ, వ్యాఖ్యానాలూ వింది. నిజమే, భర్త ఎంత బాధ పెట్టినా ఎన్నడూ పంచాయితీ పెట్టలేదు. పోలీస్ కేసు పెట్టలేదు. కానీ, ఇప్పుడు అల్లుడి విషయంలో ఆమె అతని చర్యని సమర్థించలేకపోతోంది. లోకం ఏమనుకున్నా... బిడ్డనే తప్పుపట్టినా సరే.. రోగం దాచిపెట్టి తిరుగుతున్న వాడిని వదిలేస్తే ఇంకెంత మందికి ప్రాణం మీదికి తెస్తాడో.. తప్పదు. అనుకొన్న లచ్చుమమ్మ బిక్కమొహం వేసుకొని తల్లి పక్కనే కూర్చున్న పెద్ద మనుమరాలిని వెంట పెట్టుకొని పోలీస్‌స్టేషన్ కేసి అడుగులేసింది.

గజ్జి, గోకుడు రోగం రాకుండా శుభ్రంగా ఉండాలి గానీ వచ్చినంక మందులు వేసుకోవడం కాదు పరిష్కారం. సర్కారు ఆ మాయదారి రోగం మీద కోట్లు ఖర్చు చేస్తోందని అల్లుడిని చర్చి దవఖానలో చేర్చినప్పుడు ఫాదర్ చెప్పాడు. అటువంటి రోగాలు తెచ్చుకోవద్దని చెప్పాలి, మంచి ప్రవర్తనతో ఉండుమని చెప్పాలి గాని ఏమిటో సర్కారే తొడుగులు పంచుడు అర్థం కావట్లేదు అనుకొంటున్న... ఆమె, మనుమరాళ్ళకు చదువే కాదు పరిస్థితులతో పోరాడటం తెలపాలి.. జీవితంలో బతకడం నేర్పాలి.. ఆమె ఆలోచనల్లో వేగం.. నడకలో వేగం.. ఆమెను అందుకోవాలని ప్రయత్నిస్తూ.. మనుమరాలు.



# నానీలు

**ఎస్. జగదీశ్వరి**



తెల్ల బంగారమా !
నల్ల బంగారమా !
"బంగార" మేదైనా
కాదేదీ "స్కాముల" కనర్హం

క్షీరపానమా !
మద్యపానమా !
పానమేదైనా
కాదేదీ "కల్తీల" కనర్హం

బాలకార్మికులా !
రైతు కూలీలా!
కూలీలెవరైనా
కారెవరూ "దోపిడీ" కనర్హం

పసికూనలా!
పండు ముదసలులా!
పడతులెవరైనా
కారెవరూ "అరాచకాల" కనర్హం

ప్రపంచీకరణా !
ప్రాపంచీకరణా !
కారణమేదైనా...
కాదేదీ 'రగడ' కనర్హం

మతోన్మాదమా !
కులోన్మాదమా!
నాదమేదైనా...
కాదేదీ "మారణహోమానికనర్హం"

అర్హమైనది
అమూల్యమైనది
ఆచరణమైనది
"మానవత్వమే" "మానవత్వమే" ఇలలో

---

## ఒక ఆలోచన

**- -ఫైజ్ అహమద్ ఫైజ్**

**అనువాదం : డా॥ యార్లగడ్డ నిర్మల**

**9014656539**

ఎందుకు నా మనసు ఆనందంగా లేదు
ఎందుకు మౌనంగా ఉంటాను
వదిలెయ్ నా సంగతి
ఎలా ఉన్నా నేను బాగానే ఉన్నాను

నా మనసు దుఃఖంగా ఉంటే ఏమయ్యింది
ప్రపంచమంతా దుఃఖమయమే
ఈ దుఃఖం నీది కాదు నాదికాదు
మనందరి ఆస్తి ప్రియా

నువ్వు నా దానివయినా
ప్రపంచంలో ఈ దుఃఖం ఇలాగే ఉంటుంది
పాపాల వలలు, దౌర్భాగ్యాల బంధనాలు
మనం అనుకుంటే అంతమయ్యేవికావు



దుఃఖం ఎప్పుడూ బాధాకరమే
మనదైనా ఇంకొకరిదైనా
ఏడుపు, ఆక్రందన, మనసులో మండే గాయం
మనవే మరి మనవే మరి

ప్రపంచంలో దుఃఖాన్ని ఎందుకు స్వంతం చేసుకోకూడదు
తర్వాత నివారణ చిట్కాలు ఆలోచిద్దాం
తర్వాత సుఖ స్వప్నాలు చూద్దాం
ఆ స్వప్నాల సాకారత గురించి ఆలోచిద్దాం

బాధల్లేని ఐశ్వర్యవంతులు
అసలు వాళ్ళు సుఖంగా ఎందుకుంటారు
వాళ్ళు సుఖాల్ని పంచొచ్చుగా
వాళ్ళూ మనలాంటి వాళ్ళే కదా !
యుద్ధం భయానకమని మేము ఒప్పుకుంటాం
తలలు పగులుతాయి, నెత్తురు ప్రవహిస్తుంది
నెత్తుటిలో దుఃఖం కూడా కొట్టుకుపోతుంది
మేమూ ఉండం, దుఃఖమూ ఉండదు.

# కొత్త పుస్తకాలు

## స్ఫూర్తిశిఖరం

- కె. ఆనందాచారి

వెల : రూ.20/- పేజీలు : .....

ప్రతులకు : 040-27660013




జీవిత కథనంపై కవనం పట్టుగా నడపడం కష్టమైనా ప్రక్రియా పరమైన ప్రతిభ చూపించి ఆద్యంతం తూకం తూగు కొనసాగించాడు. సమకాలీన పరిణామాలను చెబుతూ వర్తమానంలోకి దూకించడం ఇలా పలురకాల పద్ధతులను పాటించడం వల్ల ఇది సాధ్యమైంది. సందోర్భచితమైన శైలి కావడం వల్ల కొన్ని చోట్ల భావుకత మరికొన్ని చోట్ల అచ్చమైన భౌతికత కూడా మేళవించగలిగాడు.

- తెలకపల్లి రవి

## శతాబ్ది వెన్నెల

కవిత్వం

కె. గీత

వెల : రూ.129/- పేజీలు : 108

ప్రతులకు : 9395500555




ఇది నా మూడవ కవితా సంపుటి. 2001 ద్రవభాష, 2006లో శీతసుమాలు దేనికవే ప్రత్యేక సందర్భాలు. అయినా ఇప్పుడు 'శతాబ్ది వెన్నెల' ఒక వైవిధ్యమైన ప్రవాస సందర్భం. ఈ కవితలన్నీ దాదాపుగా కాలిఫోర్నియా వచ్చేక రాసినవి. ప్రవాస జీవితం ఒక అనుకోని, అరుదైన మలుపు నా జీవితంలో. అయితే ఇక్కడ జీవితంలో కొత్త ఆనందాలతో బాటూ, సమాజంలో ప్రత్యేక భాగస్వామ్యత లోపించిన నిర్లిప్తత, వెనకటి జీవితంలో ఉన్నవేవో కోల్పోయిన, కోల్పోతున్న చేదు అనుభవాలు కూడా కలగడం రెండో పార్శ్వం.

- కె. గీత

## మహాశూన్యం

అనుభావ కావ్యం

డా॥ దీర్ఘాశి విజయభాస్కర్

వెల : రూ.70/- పేజీలు : 104

ప్రతులకు : పాలపిట్ట బుక్స్




డాక్టర్ విజయభాస్కర్ నాటకాన్ని ఒక కథలా ప్రారంభించి కావ్యంలా ముగిస్తాడు. ఆ లక్షణం వల్లనే ఆయన నాటకాల్లోని ఎన్నో మాటలు ఉత్తమమైన కవితా పంక్తుల్లా రసజ్ఞుల మనసుల్లో నిలిచి ఉన్నాయి. ఒక ఆధ్యాత్మిక దర్శనం, సామాజిక నిబద్ధత, సామాన్యుని అభ్యుదయం కోసం నిరంతర తపన, విజయభాస్కర్ రచనలోని జీవశక్తులు. ఈ అంశాలే కవితాత్మకంగా మరింత బలపడి ఈ కావ్యంలో సాక్షాత్కరిస్తాయి.

పాలపిట్ట బుక్స్

## కె.వి.ఆర్. సాహిత్య వ్యాసాలు

కె.వి.ఆర్., శారదాంబ స్మారక కమిటీ

వెల : రూ.300/- పేజీలు : 798

ప్రతులకు : 98490 83137




ఈ వ్యాసాలు షుమారుగా మూడు నాలుగు దశాబ్దాల కాల వ్యవధిలో రాసినవి. అందువల్ల వ్యాసాల భాషలో, శైలిలో ఒకింత మార్పు కనిపిస్తుంది. తొలిదశకు చెందిన వ్యాసాలు కొంత గ్రాంథిక శైలిలో ఉండడం గమనిస్తాం. సాధారణ పాఠకులకు అర్థంగాని సంస్కృత పదాలేకాదు, ఈనాడు వ్యవహారంలో లేని అరుదైన తెలుగు పదాలను కూడా కొన్ని వ్యాసాలలో ప్రయోగించి ఉన్నారు.

- వి. చెంచయ్య

## 80 ఏళ్ళ తెలుగు సినిమా ప్రస్థానం

పొన్నం రవిచంద్ర

వెల : రూ. 900/- పేజీలు : 334

ప్రతులకు : విశాలాంధ్ర




సినిమాని, సాహిత్యాన్ని ఎంతగానో ప్రేమించే రవిచంద్ర 8 దశాబ్దాల తెలుగు సినిమా ప్రయాణంలో వివిధ దశలను, ఘట్టాలను పేరెన్నికగన్న మైలురాళ్ళను చారిత్రక కోణంతోనూ, సమకాలీన దృక్పథంతోనూ విశ్లేషించిన తీరుకు నిలువుటద్దం - ఈ ప్రస్థానం !

- మామిడి హరికృష్ణ

## మల్లెలు తూరు పెత్తిన వేళ

కవిత్వం

- సి. వేణు

వెల : రూ. 116/- పేజీలు : 124

ప్రతులకు : 9900896123




50 ఏళ్ళ క్రితమే తరచు కరువు బారిన పడే రాయలసీమ రైతుల వెతల్ని కథలుగా మలిచిన రచయితలలో వేణుగారు ముఖ్యులు. వానొచ్చె గంగు లాంటి కథలు అందుకు తార్కాణం. చిత్తూరు జిల్లా రచయితల సంఘం ప్రచురించిన కథా, గేయ సంకలనాలలో వేణుగారి కథలు గేయాలు చోటు చేసుకున్నాయి.

- ప్రచురణ కర్తలు

## కవిరాజు త్రిపురనేని రామస్వామి గారి గురించి ప్రముఖుల అభిప్రాయమాలిక



కాట్రగడ్డ కృష్ణచంద్

వెల : రూ. 40/- పేజీలు : 76

ప్రతులకు : 08931-231834

ఆ భావాలకు ప్రభావితులైన కాట్రగడ్డ కృష్ణచంద్‌గారు, రామస్వామిగారి కృషిపై - వివిధ ప్రముఖులు వేర్వేరు సందర్భాలలో చెప్పిన అంశాలను వివిధ గ్రంథాల నుండి సేకరించి సంకలించి ఒక చిన్నపుస్తకంగా క్రోడీకరించారు. ఇది విలువైన పుస్తకం అనడంలో సందేహంలేదు.

డా॥ మాసేపల్లి

## నవలాహృదయం



27 ప్రసిద్ధ తెలుగు నవలల విమర్శనాత్మక పరిచయం

వి. రాజారామమోహనరావు

వెల : రూ.75/- పేజీలు : 156

ప్రతులకు : విశాలాంధ్ర

పఠనాపరంగా, ప్రయోగపరంగా, ఉద్యమస్ఫూర్తి వల్ల, సృజనాపరమైన కొత్త దృక్కోణం వల్ల, వస్తువు వల్ల, రచనాపరమైన నైపుణ్యంతో... ఇలా రకరకాలుగా ఎంతో ప్రాచుర్యం పొందిన ప్రసిద్ధ తెలుగు నవలలు ఎన్నో ఉన్నాయి. అలాంటి నవలల్లో కొన్నింటిని అమెరికాలో వెలువడే తెలుగునాడి మాసపత్రిక కోసం విమర్శనాత్మక పరిచయాలుగా నేను రాశాను. ఆ రచనల సంపుటే ఈ పుస్తకం

- ప్రచురణ కర్త

## పాట వెనుక ఫ్లాష్



డా॥ వేదగిరి రాంబాబు

వెల : రూ. 50/- పేజీలు : 127

ప్రతులకు : 9391343916

తల్లిదండ్రులచాటున ఉన్నంతకాలం జీవితం ఓ పాటలా సాగిపోతుంది. ఆ తర్వాత వ్యక్తిగత జీవిత వ్యథలు, వింతానుభూతులు, అనుభవాలు.. ఇలా సాగిపోతుంది జీవితం. ఇరవయ్యేళ్ళలోపు తమ జీవితాన్ని కొన్ని పాటలతో ముడివేసి, పాటలతో ముడిపడివున్న జీవితాన్ని చెబుతూ, ఫ్లాష్‌బాక్‌లోకి తొంగిచూస్తూ అలనాటి ఆటపాటల జీవితాన్ని అందంగా మనముందుంచారు డా॥ రాంబాబు.

- ప్రచురణకర్త

## సోమయ్యకు నచ్చిన వ్యాసాలు



సమకాలికజీవితం సమాజం సందర్భం

వాడ్రేవు చినవీరభద్రుడు

రూ. 250/- పేజీలు : 476

ప్రతులకు : 9177392903

దాదాపు పుష్కరకాలంలో (2000-2012) వాడ్రేవు చినవీరభద్రుడు అనేక అంశాల పట్ల చాలా లోతుగా, తాత్వికంగా, సృజనాత్మకంగా, రసాత్మకంగా సమాజం పట్ల ప్రేమతో, సాహిత్య, సామాజిక, తాత్విక, చారిత్రక విషయాల మీద గొప్ప సమన్వయంతో రాసిన వ్యాసాల సంకలనమే ఈ పుస్తకం.

- ప్రచురణ కర్త

## ప్రలోభం



నాయుని కృష్ణమూర్తి

వెల : రూ.80/- పేజీలు : 216

ప్రతులకు : వియన్నార్ బుక్‌వరల్డ్

ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం ఎక్కడా కనిపించడం లేదెందుకు? ఎవరికీ భుజాల మీద తలలు ఉన్నట్లు లేదే! తలలకు బదులు టివిలు, సినిమాతెరలు, కంప్యూటర్లు కనిపిస్తున్నాయెందుకు? మనుషుల మధ్య దూరమింత పెరిగిపోయిందేమిటి? ఎదురెదురుగా నిలబడి మాట్లాడుతున్నా మధ్యలో మహాసముద్రాలు కనిపిస్తున్నాయే! అటు చూడండి! ఆ అమ్మాయి ముఖం మీద ఆసిడ్‌పోసి పారిపోతున్నాడు ఎవడో! ఇంతటి గందరగోళంలో సతమతమవుతున్న మనస్సులోంచి ఎగదన్నుకొచ్చింది నవల.

- నాయుని కృష్ణమూర్తి

## నేలతీపి అజ్ఞాతం

కథా రూపకాలు

- డా॥.వి.ఆర్. రాసాని

వెల : రూ.60/- పేజీలు : 105

ప్రతులకు : 9848443610

నా కథలు కొన్ని నాటికలుగాను, నాటకాలుగాను నాటకీకరింపబడ్డాయి. అలాంటి వాటి గురించి ఒకసారి చర్చించుకుంటున్న సందర్భంలో సాహిత్య విమర్శకులు, ఎస్వీ యూనివర్శిటీలోని తెలుగు అధ్యయన శాఖలో ఆచార్యులు, మిత్రులు డా॥ మేడిపల్లి రవికుమార్‌గారు, అలాంటి నాటికలను వాటి మూలకథలతో బాటుగా ఒక పుస్తకం వేస్తే బాగుంటుందని సూచించారు. వారి సూచన కనుగుణంగానే ఈ పుస్తకం ముద్రించడం జరిగింది. - రచయిత

సడ్లపల్లె చిదంబరరెడ్డి
9440073636

## పుడమి సూర్యుడు



అతడు పొద్దుకు ముందే పుట్టే పుడమి సూర్యుడై
మట్టితల్లిని మురిపించే మార్మిక మానవశక్తి
సూర్యున్ని మించి జ్వలించే ఆశయ దీపమై
ఆకాశమంత కలల మేఘాల్లో - గగనమంతా విస్తరిస్తాడు.
మబ్బులకన్నా ముందే ఋతుపవనచలనమై
చినుకుల కన్నాముందే దుక్కిఎదలో మార్దవమై
ఆవిశ్రాంత శ్రమ పరిమళ చెమట మొక్కై
పొలాలంతా కాళ్లను వేళ్లుచేసి నాటుకొంటాడు
మురిపాలిచ్చి బిడ్డను లాలించే కమ్మని అమ్మ చేతులై
మొళ్లనోళ్లల్లో చిగుళ్ల ప్రాణాలుపోసే అపరధన్వంతరై
పచ్చని పైర్ల సిగలో ఉజ్వల స్వప్నాల బీజాలకంకై
జనజీవనయానానికి భరోసాగా నిలుస్తాడు
ఫలాల గింజలు కల్లంలో అతని కష్టాల బస్తాల కెక్కకముందే
కరువులు వరదలు అప్పులు ధరలు నానాదుర్మార్గాలు
తల కాళ్లు చేతులు ఏ అవయవమూ లేని వికృతమృగాలై
రైతు సంహార అభయారణ్యంలో కండలుగా కొరికేస్తే-
ఎవరి భరోసాలూ అందక, ఎందరికో స్వచ్ఛంద బలిహారమై
'రైతేరాజు' వినాదాల హోరులో పిండప్రగీతగా తరిస్తాడు.
దళారీతోడేళ్లు నకిలీల కొండచిలువలు ఆబగాతిన్నదరక్క
చీకటిదుర్గాల్లో మద్యంగుంతల్లో నల్లజీవాలైపడి దొర్లుతుంటే
బిడ్డను పోగొట్టుకున్న భూమి తల్లిమాత్రం దుఃఖసముద్రమై
అలలచేతుల్తో తలబాదుకొంటు నిరంతరం రోదిస్తూనే ఉంటుంది !!

పల్లిపట్టు నాగరాజు
9989400881

## ఇప్పుడు రైతన్న

మోడు వారిన మర్రిచెట్టు
మందుతున్న ఏటిగట్టు
అదిగో అదే పొలం గట్టు
ఇదిగో ఇదే రైతు గుట్టు.
పాడుబావిలో నీరులేక
పశువులకు మేతలేక
కాడెద్దు జోడును చూస్తూ
కన్నీరు పెడ్తూ....
భారంగా తలకట్టు
వికారంగా పంచెకట్టు
దూరంగా పంపుసెట్టు
భారంగా తిరుగుతూ,
"కరెంటు కోత" భయంతో వనుకుతూ....
ప్రభుత్వాలకు
ఈ పరిస్థితి పట్టదని



తన తల తానే పట్టుకొని
దీనంగా దైనీయంగా అన్నదాత...?
చెమట చుక్కలు, కన్నీళ్ళు
కలబోసి పండించిన తిండిగింజలు కొన్ని
తాలు గింజలు మరికొన్ని
తల్లి పంటచేనందించిన కానుకని
కళ్ళకద్దుకొనే తరుణంలో....
తుఫానులో తడిసిపోయి
వరదలో కొట్టుకుపోయి
మగ్గుతున్న పంట ఫలితం
మన రైతన్నల జీవితం
ఓదార్చేదెవరు ? ఒద్దు చేర్చేదెవరు ??

# దార్శనిక పరిశోధన




పేరి. వెంకట రామకృష్ణమూర్తి

ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం - ఈ మూడు సాహిత్య సృజనకు ఆవశ్యకమయిన విషయాలుగా మన అలంకారికుల వచనం. ఈ మూడూ పుష్కలంగా ఉన్న వ్యక్తి జయంతి పాపారావు. రచయితగా, విమర్శకుడిగా, పరిశోధకుడిగా సాహితీ ప్రపంచంలో తనకంటూ ఒక విశిష్టమయిన స్థానం ఉన్నవ్యక్తి. దీనికి ప్రబల నిదర్శనం వీరి సాహిత్యంపై వచ్చిన ఎమ్.ఫిల్, పి.హెచ్.డి పట్టాలే. వీరి "అధ్యయనం - నూరేళ్లు - నూరుగురు కథకులు - నూరు కథానికలు" వీరి సాహితీ వ్యవసాయంలో పండిన మేలిమి పంట. ఒక దార్శనిక పరిశోధన. నూరేళ్ల కథా సాహిత్యాన్ని విమర్శనాదృష్టితో పరిశీలించి మేలిమి కథలను ఎన్నుకొని, కథకులను ప్రస్తావించి, కథలను విశ్లేషించాలంటే ఎంతో అవగాహన ఉండాలి. సంక్షిప్తంగానైనా, సారం జారిపోకుండా చెప్పగలిగే సత్తా ఉండాలి. ఈ రెండూ ఉన్నవారు జయంతి పాపారావు.

శతవసంత తెలుగు కథానికా సాహితీ చారిత్రక నేపథ్యంలో ఈ గ్రంథం వెలువడింది. 1910 ఫిబ్రవరి 'ఆంధ్రభారతి'లో గురజాడ రచించిన 'దిద్దుబాటు' కథానిక ప్రచురితమై తొలి 'ఆధునిక కథానిక'గా ప్రఖ్యాతమయింది. ఏ శుభ ముహూర్తాన ప్రారంభించాడో గురజాడ, కథానిక సాహితీ స్రవంతి నిండుగా జీవవంతంగా ప్రవహిస్తూనే ఉంది. కథా సాహిత్యం సామాజిక దర్పణం వంటిది. సమాజంలో ప్రతి అంశాన్ని ప్రతిబింబిస్తూనే ఉంటుంది. అందుచేత తెలుగు కథానిక సాహిత్యం ఏ విధంగా సామాజిక, ఆర్థిక, రాజకీయ స్థితిగతుల్ని సాంస్కృతిక పరిణామాల్ని సామాజిక పరివర్తనల్ని ప్రతిబింబించిందో ఏయే హేతువులు సామాజిక సమానత్వం, లేదా సమతత్త్వం వర్ణ, వర్గరహిత, సంసారయుత ఉత్తమ సమాజ ఆవిర్భావం కోసం తోడ్పడ్డాయో పరిశీలించి, విశ్లేషించి మదింపు వెయ్యడమే జయంతి వారి ప్రధానోద్దేశమని విదితమవుతుంది.

1910వ సంవత్సరం ఆదిగా 2009 వరకు ఒక్కొక్క కథకుని, ఒకొక్కక్క కథానికను గ్రహించి కాలక్రమ చారిత్రక పరిశోధనాత్మకంగా విమర్శించేసి తన అధ్యయన ధ్యేయానికి సార్ధకత సమకూర్చారు. ప్రతికథానికని నిశితంగా పరిశీలించి ఉన్నత సాహితీ ప్రమాణాలకు అనుగుణంగా రాగద్వేషాలకు అతీతంగా తనదైన తీర్పును వెల్లడించారు. ఇందులో శాస్త్రీయదృష్టి, పరిశోధనాపాటవం, సాహితీ తాత్త్విక గ్రంధమంతటా పరచుకొని ఉండడం మనం గమనించగలం. శతజయంతి అధ్యయనం పరిచయం బీజంతో మొదటి అధ్యాయం ప్రారంభం అయి నూరు కథానికలు - విశ్లేషణ, నూరేళ్ల తెలుగు కథ - స్త్రీ పురుష సంబంధాలు, నూరేళ్ల తెలుగు కథ - కుటుంబసంబంధాలు, నూరేళ్ల తెలుగు కథ - సామాజిక సంబంధాలు, నూరేళ్ల తెలుగు కథ - ప్రజా సమస్యలు, నూరేళ్ల తెలుగు కథ - కొన్ని కథనరీతులు శతజయంతి అధ్యయనం - సారాంశం, అధ్యాయాలతో క్రమంగా అంకురించి, పుష్పించి, ఫలభరితమయిన ఒక తెలుగు కథానికా సుందర రసాల సాలంగా సాక్షాత్కరిస్తుంది. ఇది భావి పరిశోధక అధ్యేతలకు సుస్నిగ్ధమయిన ఛాయనందించడమే కాదు రసవత్ఫలాలను కూడా విందుచేస్తుంది. అధ్యయన సాంతత్యానికి కావలసిన బీజాలను అందిస్తూనే.

అధ్యయనం చదివితే- ఆ కథలు చదవాలనిపిస్తుంది. ఆ రచయితల గురించి తెలుసుకోవాలనిపిస్తుంది. అంతేకాదు కథలను ఏ వెలుగులో చదవాలో ఒక సమ్యక్ దృష్టిని ప్రసాదిస్తుంది. పరిశోధక విద్యార్థుల, పుస్తక ప్రియుల పుస్తక భాండాగారంలో అవశ్యం ఉండవలసిన గ్రంథం.



# జన యోధుడికి కవన నీరాజనం




మే 19న హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో జరిగిన సుందరయ్య శతజయంతి జనకవనంలో ప్రసంగిస్తున్న ప్రముఖ నవలా రచయిత అంపశయ్య నవీన్.

కమ్యూనిస్టు యోధుడు, మహానేత పుచ్చలపల్లి సుందరయ్య శతజయంతి ఉత్సవాల ముగింపు సందర్భంగా హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో మే 19న నిర్వహించిన 'జనకవనం' స్ఫూర్తిదాయకంగా సాగింది. నాలుగు పుస్తకాల ఆవిష్కరణలు, మధ్యలో ప్రముఖుల ఆత్మీయ సందేశాలూ, ఔత్సాహిక కవులకు మార్గనిర్దేశనాలతో వైవిధ్య భరితంగా, ప్రయోజనకరంగా నడిచింది. వివిధ జిల్లాల నుంచి హాజరైన కవులు సమకాలీన సమస్యలపై అక్షరాస్త్రాలు సంధించి, సుందరయ్య స్మృతికి ఘన నివాళులు అర్పించారు. పలువురు సాహితీవేత్తలు ఈ సందర్భంగా మాట్లాడుతూ- సాహిత్యానికి, సమాజానికి ఉన్న సంబంధం గురించి, నేడు సమాజంలో లుప్తమవుతున్న విలువల గురించి వివరించారు. మానవీయ విలువలను విధ్వంసం చేస్తున్న మార్కెట్ శక్తులపైనా, విశాల ప్రజా ప్రయోజనాలకు విఘాతం కలిగిస్తున్న ప్రపంచీకరణపైనా కవులూ, రచయితలూ మరింత సమర్థవంతంగా, సమరశీలంగా పోరాడాలని పిలుపునిచ్చారు. సుందరయ్య పోరాట స్ఫూర్తిని, ఆదర్శనీయమైన జీవన విధానాన్ని సాహిత్యకారులూ అలవర్చుకోవల్సిన అవసరం ఉందని పేర్కొన్నారు.

### ఆదర్శమూర్తికి అక్షర నివాళి

తొలుత ఈ జనకవనం ఏర్పాటైన ప్రత్యేక సందర్భం గురించి సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు, ఈ కార్యక్రమ సమన్వయకర్త తెలకపల్లి రవి వివరించారు. 'సద్గుణములెల్ల సంగములై వచ్చి... అన్న పోతనామాత్యుడి అక్షరాలకు అచ్చు పోసినట్టు సరిపోయే ఆదర్శమూర్తి పుచ్చలపల్లి సుందరయ్య. ఆ మహనీయుడి శతజయంతి ఉత్సవాలను పురస్కరించుకొని – దేశవ్యాప్తంగా ఏడాది పాటు వివిధ రూపాల్లో విస్తృతంగా, విస్తారంగా సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి. దేశ సమకాలీన సమస్యలపైనా, పరిష్కార మార్గాలపైనా మేధోమథనాలూ జరిగాయి. ఉత్సవాల ముగింపులో భాగంగా సాహితీ స్రవంతి, సుందరయ్య విజ్ఞాన కేంద్రం సంయుక్తంగా ఈ జనకవనాన్ని ఏర్పాటు చేశాయి'. అని చెప్పారు. "సుందరయ్య సమాజ అభ్యున్నతి కోసం అహర్నిశలూ కృషి చేసిన ఆచరణశీలి. గొప్ప సిద్ధాంతాన్ని ఆచరించి, మహోన్నతంగా రూపుదిద్దుకున్న మహా మనీషి. సమాజ పురోగమనంలో సాహిత్య కళారంగాల పాత్ర గణనీయంగా ఉంటుందని గుర్తించి, తెలుగు గీతాల పోటీ నిర్వహించిన దార్శనికుడు. సుందరయ్య ప్రత్యేక కృషి కారణంగా 'పాడరా, ఓ తెలుగువాడా', 'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా' వంటి ప్రఖ్యాత గీతాలు ఆవిర్భవించాయి. 'తెలుగు భాష అభివృద్ధి పట్ల, భాషా విధానం పట్లా స్పష్టమైన అవగాహనతో సుందరయ్య కృషి చేశారు. తెలుగు భాషా సాంస్కృతిక రంగాల్లో గొప్ప ప్రభావం చూపించారు.' అని వివరించారు. 'కవులూ రచయితలూ స్పష్టమైన సామాజిక అవగాహనతో అనువర్తించటమే సుందరయ్య ఆశయాలకు కొనసాగింపు. అలాంటి కవితలను పఠించి, కర్తవ్యాలను తలకెత్తుకోవటానికి ఈ జనకవనం ఏర్పాటు చేశాం'. అని పేర్కొన్నారు.

### మాటలూ.. కవితలూ...

జనకవనాన్ని ప్రముఖ కవి కె. శివారెడ్డి ప్రారంభించారు. వ్యక్తిత్వాలు విధ్వంసమై, ద్వంద్వ స్వభావాలు విరాజిల్లుతున్న నేటి పరిస్థితుల్లో సుందరయ్య ఆశయం, ఆదర్శనీయ వ్యక్తిత్వం అందరికీ అనుసరణీయమని అన్నారు. ఈ దేశపు సాహిత్య, సాంస్కృతిక, సామాజిక రంగాల్లో కమ్యూనిస్టులు గణనీయమైన, గొప్పదైన ప్రభావాన్ని చూపారని అన్నారు. అణగారిన తరగతులూ మహిళలూ ఒక ప్రవాహంలో కలగలిపి నడిపించటంలో వారి పాత్ర మహత్తరమైనదని అన్నారు. 'నేను నేరుగా సుందరయ్యను చూడలేదు. ఆయన మాటలు వినలేదు. చూడకుండానే, వినకుండానే అలాంటి అనుభవం ఇచ్చినవాడు గొప్పవాడు. సుందరయ్య అలాంటివాడు. ఆయన శత జయంతి సందర్భంలో ప్రతి ఒక్కరూ ఆత్మ విమర్శ చేసుకోవటం అవసరం'. అని అన్నారు. తరువాత – 'మాట కూడా మనిషే.' అన్న కవిత వినిపించి జనకవనానికి శ్రీకారం చుట్టారు.

కేంద్ర సాహిత్య అవార్డు గ్రహీత అంపశయ్య నవీన్, సాహిత్యవేత్తలు నిఖిలేశ్వర్, ద్వానా శాస్త్రి, సుధామ తమ సందేశాలు వినిపించారు. 'సుందరయ్య మీది అభిమానంతోనే నేను వరంగల్ నుంచి ప్రత్యేకంగా వచ్చాను. కమ్యూనిస్టు ఎలా ఉండాలి? అంటే- ఇలా ఉండాలి అని చూపగలిగిన ఆదర్శమూర్తి ఆయన. నేడు ప్రతి ఒక్కరూ అలాంటి లక్షణాలను అలవర్చుకోవడం చాలా అవసరం'. అని అంపశయ్య నవీన్ అన్నారు. 'కమ్యూనిస్టుగా ఉన్న వ్యక్తి సాహిత్యాన్ని, రాజకీయాన్ని సమన్వయం చేయాలి. సుందరయ్య ఆ పనిని విజయవంతంగా చేశారు. వివిధ సందర్భాల్లో ఆయన రాసిన సాహిత్య విమర్శలు, ఆ రంగంలో చేసిన కృషీ గొప్ప ఆదర్శవంతమైనవి.' అని నిఖిలేశ్వర్ పేర్కొన్నారు. భవిష్యత్తుపై గొప్ప ఆశా దృక్పథాన్ని పెంపొందిస్తూ- 'యుగస్వరం' అనే కవిత చదివి వినిపించారు. ద్వానా శాస్త్రి మాట్లాడుతూ- 'కవిని కన్న తల్లి కడుపు ధన్యంబు.' అన్న జాషువా పద్యోక్తిని ఉటంకించారు. 'నేడు కవిత్వం చాలా వస్తోంది. రాజకీయ కవిత్వం తగినంత రావటం లేదు. దానిపై కవులు దృష్టి కేంద్రీకరించాలి.' అని సూచించారు. సుధామ మాట్లాడుతూ, అలగానిపాడులో జన్మించిన సుందరయ్య అలవిగాని పాడు వ్యవస్థపై అనితర సాధ్యమైన పోరాటం చేశారని ప్రస్తుతించారు. 'సుందరయ్యను చూస్తేనే అప్పట్లో చాలామంది పాలక పెద్దలకు భయం. అంత నికరమైన, నిక్కచ్చి మనిషి ఆయన.




సుందరయ్య శత జయంతి జనకవనంలో
ప్రసంగిస్తున్న ప్రముఖ కవి నిఖిలేశ్వర్

చట్ట సభల్లో సూటిగా, సూత్రబద్ధంగా, వివరాలతో సహా మాట్లాడి, విపక్ష నేతలను సైతం ఆకట్టుకునేవారు. 1982లో ఆయన రేడియో ప్రసంగాన్ని రికార్డు చేసే అవకాశమూ, అదృష్టమూ నాకు దక్కాయి.' అని చెప్పారు. అప్పట్లో ఆయన సుందరయ్యపై రాసిన కవిత 'జీవనధార స్మృ తి' కవితను చదివి వినిపించారు.

### అలరించిన జనకవనం

తరువాత- వివిధ జిల్లాల నుంచి వచ్చిన సుమారు 65 మంది కవులు తమ కవితలు చదివి వినిపించారు. లబ్ధప్రతిష్ఠులైన కవులతో పాటు 17 ఏళ్ల రౌతు కదలి (ఖమ్మం), 11 ఏళ్ల హోమ్మిబాబు (హైదరాబాద్) వంటి వారూ కవితలు వినిపించటం జనకవనం స్ఫూర్తికి నిదర్శనం. సుందరయ్య ఆదర్శాన్ని, వ్యక్తిత్వాన్నీ ప్రస్తుతిస్తూ అనేకమంది కవులు అక్షరాంజలి ఘటించారు. ఆయన ఆశయాలను ఆచరిస్తామని, ఆయన నడిచిన బాటను అనుసరిస్తామని ప్రతిన పూనారు. రాజకీయాల్లో విలువల పతనం, మహిళలపై ఆరాచకం, అధిక ధరల దరువు, భారం అవుతున్న సామాన్యుల బతుకు తెరువు, అంతరిస్తున్న జీవవైవిధ్యం, పెచ్చు మీరుతున్న అసమానతలు.. తదితర అంశాలపై కవులు కవితలూ, పద్యాలూ ఆర్తితో, ఆవేదనతో వినిపించారు. ప్రశ్నించాల్సిన అవసరాన్ని, సంఘటితం కావల్సిన సందర్భాన్ని కొందరు నొక్కి వక్కాణించారు. ఈ సభలో సుమారు 130 మంది పాల్గొనగా, 65 మంది కవితలు చదివారు. ఆనందాచారి, వౌరప్రసాద్, జంధ్యాల రఘుబాబు, సత్యాజీ, కుమారస్వామి, శాంతిశ్రీ, రౌతు రవి, కెంగార మోహన్ ఈ జనకవనాన్ని నిర్వహించారు. ఇటీవల మృతి చెందిన ప్రముఖ కవి కలేకూరి ప్రసాద్ స్మృతికి కవులూ, రచయితలూ సంతాప సూచకంగా కొద్దిసేపు మౌనం పాటించారు.

### నాలుగు పుస్తకాల ఆవిష్కరణ

ఈ సాహిత్య కార్యక్రమంలో కవితాపఠనం మధ్య మధ్యలో మూడు పుస్తకాల ఆవిష్కరణ జరిగింది. ఈ నాలుగూ నాలుగు సాహిత్య ప్రక్రియలకు సంబంధించినవి కావడం విశేషం. తొలుత ప్రముఖ కవి అద్దేపల్లి రామ్మోహనరావు కవితా సంపుటి 'కాలం మీద సంతకం'ను ప్రముఖ సాహిత్యవేత్త అంపశయ్య నవీన్ ఆవిష్కరించారు. మేడిపల్లి రవికుమార్ పరిచయం చేశారు. 'అద్దేపల్లి కాలంతో పాటు సరికొత్తగా ప్రయాణించే కవి. సమకాలీన సంక్షోభాలపై ఆయన స్పందనల అక్షర సమ్మేళనమే ఈ కవిత్వం' అని చెప్పారు. 'సమకాలీన సంక్షోభాల నుంచి, అవసరాల్లోంచి ఆవిర్భవించిన కవులు నిత్యం సామాజిక బాధ్యతతో వ్యవహరించాలి. వైయక్తిక బలహీనతలను అధిగమించి, సామూహిక, సామాజిక ప్రయోజనాలకు కట్టుబడి ఉండాలి. సుందరయ్య జీవితం మనకు నేర్పే గొప్ప విషయం అదే!' అన్నారు. కవి అద్దేపల్లి మాట్లాడుతూ, ప్రపంచీకరణ ప్రభావం ప్రతి ఒక్కరిపైనా పడిందని, దానికి ప్రతిఘటన ప్రారంభమైందని అన్నారు. ఈ నేపథ్యంలో విస్తృత ప్రాతిపదికన ఉద్యమాలను నిర్మించాల్సి ఉందని అన్నారు. శిరంశెట్టి కాంతారావు నవల 'ఆకుపచ్చ విధ్వంసం' నవలను మండవ సుబ్బారావు ఆవిష్కరించారు. ముక్తవరం పార్థసారథి పరిచయం చేశారు. 'నల్గొండలో పుట్టి, ఉద్యోగరీత్యా ఖమ్మంలో ఉంటున్న ఈ రచయిత ఉత్తరాంధ్రలోని సమస్యపై నవల రాయడం అభినందనీయం. ఇలాంటి జీవన వైరుధ్యాలను పట్టుకొని, సాహిత్యీకరించటం నేడు ఎంతైనా అవసరం' అని పేర్కొన్నారు. పుస్తకావిష్కర్త మండవ సుబ్బారావు మాట్లాడుతూ, ఈ నవలలో కృష్ణారావు మాష్టారు, ఎండమ్మ పాత్రలు రెండూ కీలకంగా కనిపిస్తాయని, వాటిని రూపొందించిన తీరు అద్భుతంగా ఉందని అన్నారు. ఉద్యమాలు సామాన్యులు ఎలా సాహసవంతులను చేస్తాయో, త్యాగధనులుగా తీర్చిదిద్దుతాయో ఈ నవల విశదీకరిస్తుందని చెప్పారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి సుందరయ్యపై రాసిన స్ఫూర్తి శిఖరం' దీర్ఘకవితను ప్రజాశక్తి సంపాదకులు తెలకపల్లి రవి ఆవిష్కరించారు. ప్రముఖ కవి సీతారాం పరిచయం చేశారు. బొమ్మరాత యల్లయ్య రాసిన 'నెమలీకలు' నానీల సంపుటిని అద్దేపల్లి రామమోహన్‌రావు ఆవిష్కరించారు.

### సందేశాలూ... నిర్దేశాలూ...

కవితాపఠనం మధ్యలో ప్రముఖ కవి యాకూబ్, ప్రజానాట్య మండలి ఉపాధ్యక్షులు దేవేంద్ర, డా. పిల్లలమర్రి రాములు ఆత్మీయ సందేశాలు వినిపించారు. 'కవిత్వం చారిత్రక పాత్ర నిర్వహించే సాహిత్య సాధనం. దానిని విస్తృతంగా ప్రచారం చేయాలి. ప్రతి కవీ మరికొందరి కవిత్వాన్ని జనంలోకి తీసుకెళ్లాలి. కవిత్వపు స్థాయిని, ప్రయోజనాన్ని పెంచాలి. మనిషినికదిలించి, కర్తవ్యోన్ముఖున్ని చేయాలి. అలాంటి కవిత్వానికి ఎప్పుడూ ఆదరణ ఉంటుంది.' అని చెప్పారు. 'కవిత్వంతో మాటా ముచ్చటా' అన్న కవితను చదివి వినిపించారు. దేవేంద్ర తన సందేశంలో- సాహితీ స్రవంతి, ప్రజానాట్య మండలి ఒకే లక్ష్యంతో సాహిత్య కళారంగాల్లో పనిచేస్తున్నాయని చెప్పారు. పరాయీకరణ, మార్కెటీకరణా పెచ్చుమీరిన ఈ తరుణంలో మరింత బలమైన కవిత్వం రావాలని ఆకాంక్షించారు. 'నాకు వైద్యం కావాలి' అంటూ ఓ కవితను చదివి వినిపించారు. ఈ సభలో సాహితీస్రవంతి నగర బాధ్యులు గేరా, మోతుకూరి నరహరి, ఉదయ్‌శంకర్, వూసలరజనీ గంగాధర్, కె. విల్సన్‌రావు, కె. యాకూబ్, మౌనశ్రీమల్లిక్, తంగిరాల చక్రవర్తి, ఎ. మోహన్‌కృష్ణ, జి. యాదగిరిరావు, మోతుకూరి నరహరి,కె. రాజ్యలక్ష్మి తదితరులు పాల్గొన్నారు. నెమలీకలు (నానీలు) అనే బొమ్మరాతి ఎల్లయ్య రాసిన గ్రంధాన్ని చివర్లో అద్దేపల్లి రామ్‌మోహన్‌రావు ఆవిష్కరించారు.

- సత్యాజీ



# కలేకూరి ప్రసాద్ కన్నుమూత

దళిత కవి, విమర్శకుడు కలేకూరి ప్రసాద్ మే 17న ఒంగోలులో తుదిశ్వాస విడిచారు. ప్రసాద్ వయస్సు 49 సంవత్సరాలు. 1964 అక్టోబర్ 25న కృష్ణా జిల్లా కంచికచర్లలో జన్మించిన కలేకూరి ప్రసాద్ తెలుగు నాట దళిత సాహిత్యంలో కృషి చేసిన నవతరం రచయితల్లో ఒకరు. కవిగా, దళిత ఉద్యమ కార్యకర్తగా, సాహితీ విమర్శకుడిగా ఆయన పేరు సంపాదించారు. ఆయన తల్లిదండ్రులు లలితా సరోజిని, శ్రీనివాసరావులు ఇద్దరూ ఉపాధ్యాయులే. మార్క్సిజమ్‌తో ప్రభావితులైన కలేకూరి ప్రసాద్ పీపుల్స్ వార్‌లో పని చేసినా 1987లో బయటకు వచ్చేశారు. 'విప్లవ రచయితల సంఘం' (విరసం)లో నుంచి కూడా పక్కకు తప్పుకున్నారు. రాష్ట్రంలో దళితులపై జరిగిన దారుణాలకు మాయని గుర్తులుగా మారిన కారంచేడు, చుండూరు సంఘటనలు ఆయనను బాగా కదిలించాయి. 'కర్మభూమిలో పూసిన ఓ పువ్వా...' అంటూ 1987లో ఆయన రాసిన గీతం ఎంతో ప్రాచుర్యం పొందింది. నిర్మాత, నటుడు మోహన్‌బాబు నిర్మించిన 'శ్రీరాములయ్య' (1999) చిత్రంలో ఆ పాటను ప్రత్యేకంగా వాడుకున్నారు. సుప్రసిద్ధ సినీ నేపథ్య గాయకుడు జేసుదాస్ పాడిన ఆ పాట సినిమా ద్వారా జన బాహుళ్యంలోకి మరింతగా చొచ్చుకొని పోయింది. 'యువక' అనే కలం పేరుతో కలేకూరి ప్రసాద్ రాసిన కవితలు ఎంతోమందిని కదిలించాయి. 'మండుతున్న చుండూరు', 'దళిత కవిత్వం' లాంటి కవితా సంకలనాల్లో ఆయన కవితలు చోటుచేసుకున్నాయి. 'పిడికెడు ఆత్మగౌరవం కోసం...' అన్న ఆయన కవిత ఇంగ్లీషు లోకి అనువాదమవడమే కాక, ఆయనకు పేరు తెచ్చింది. కలేకూరి ప్రసాద్ అనువాదాలు సైతం చేసేవారు. రాష్ట్రంలో దళితుల స్థితిగతులపై "ప్రజాశక్తి" జరిపిన సర్వేలను ఆధారంగా చేసుకొని, ఆయన చేసిన రచన 'ఆంధ్రప్రదేశ్ దళితులు' ఓ ప్రత్యేకమైన కృషిగా నిలిచింది. అలాగే, స్వామి రామనందతీర్థ రచన 'హిందూ సామ్రాజ్యవాద చరిత్ర', 'చేగువేరా రచనలు - విప్లవం, రాజకీయాలు', 'ఎదురీత' (కిశోర్ శాంతబాయి కాళే ఆత్మకథ), 'పిల్లలు ఎలా నేర్చుకుంటారు'తో సహా పలు పుస్తకాలను ఆయన తెలుగులోకి అనువదించారు. 'దళిత ఉద్యమం - దళిత సాహిత్యోద్యమం' పేరిట ఆయన గతంలో చేసిన విశ్లేషణ తెలుగు దళిత సాహిత్యోద్యమ అధ్యయన శీలురకు ఉపయుక్తమైంది. 'మల్లెతీగ'తో సహా పలు కథానికలను దళిత వాద దృక్పథంతో ఆయన రచించారు. 'నిఘా' పేరిట ఓ మాస పత్రికను కూడా కొన్నాళ్ళు నడిపారు. సాహితీస్రవంతి, ప్రస్థానం తరపున కలేకూరి ప్రసాద్ మృతికి సంతాపం తెలియజేస్తున్నాం.

# కథా రచయిత త్రిపుర మృతి

ప్రముఖ సాహిత్యవేత్త రాయసం వెంకట త్రిపురాంతకేశ్వరరావు (త్రిపుర) మే 24న కన్నుమూశారు. త్రిపుర 1928 సెప్టెంబర్ 2న ఒడిశాలోని గంజాం జిల్లా పురుషోత్తపురంలో జన్మించారు. హైస్కూలు, కళాశాల విద్య విశాఖలోని ఎవిఎన్ కళాశాలలో పూర్తిచేశారు. బెనారస్ హిందూ యూనివర్శిటీ నుండి అగ్రికల్చరల్ బి.ఎస్.సి., ఎం.ఏ. ఇంగ్లీషు పూర్తిచేశారు. అనంతరం అధ్యాపక వృత్తిలో కొనసాగిన ఆయన వారణాసి, మాండలే, బర్మా, మదనపల్లి, విశాఖపట్నం, జాజ్‌పూర్‌ల్లో పని చేశారు. 1960లో త్రిపుర రాష్ట్రం అగర్తలాలోని మహారాజా బీర్‌బిక్రం కాలేజీలో ఆంగ్ల ప్రొఫెసర్‌గా చేరి, 1987లో ప్రిన్సిపాల్‌గా ఉద్యోగ విరమణ చేశారు. ఆ తర్వాత ఆయన భార్య లక్ష్మీదేవమ్మతో విశాఖపట్నంలో స్థిరపడ్డారు. కుమారుడు నాగార్జున అమెరికాలో, కుమార్తె నటాషా ఇంగ్లండ్‌లో, మరో కుమార్తె వింధ్య హైదరాబాద్‌లో ఉంటున్నారు. ఆయన రచనల్లో త్రిపుర కథలు ప్రాచుర్యం పొందాయి. 1963-73, 1980-1990 మధ్య ఆయన ఈ కథల్ని రాశారు. 1975లో సెగ్మెంట్స్, 1990లో బాధలూ సందర్భాలూ - కవితలు, త్రిపుర కాఫ్కా కవితలు ఆయన రచనల్లో ముఖ్యమైనవి. జిడ్డు కృష్ణమూర్తి, మార్క్సిజం, జెన్ బుద్ధిజంపై వచ్చిన రచనలు తనను ప్రభావితం చేసినట్టు ఆయన పేర్కొనేవారు. అల్డస్ హక్సలే ను ఇష్టమైన రచయితగా ఆయన కొన్ని ఇంటర్వ్యూలలో పేర్కొన్నారు. ఇంకా గ్రాహం గ్రీన్, సాల్ బెల్లో, ఆల్బర్ట్ కామూ, సార్త్రే, శ్రీశ్రీ, జేమ్స్ జాయిస్, శామ్యూల్ బెకెట్ తదితరులు తన అభిమాన రచయితలుగా ఆయన రాసిన పుస్తకాల్లో పేర్కొన్నారు. సాహితీస్రవంతి, ప్రస్థానం తరపున త్రిపుర మృతికి సంతాపం తెలియజేస్తున్నాం.



# మేడే స్ఫూర్తితో సాంస్కృతిక ఉద్యమం




మే 1 న హైదరాబాద్‌లో సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సాహితీ స్రవంతి నగర కమిటీ కార్యక్రమంలో

మేడే స్ఫూర్తితో శ్రామిక జనం పక్షాన సాంస్కృతిక, సాహిత్య ఉద్యమాన్ని నిర్వహించాల్సిన అవసరముందని ప్రజాశక్తి సంపాదకులు, సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి కవులకు, రచయితలకు పిలుపునిచ్చారు. సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో స్థానిక సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో మే 1న 'మేడే జనకవనం' నిర్వహించారు. ఈ సందర్భంగా తెలకపల్లి రవి ముఖ్యోపన్యాసం చేశారు. 125 వసంతాలు గడిచినా మేడే పోరాట స్ఫూర్తి నిత్య సజీవంగా ఉందని చెప్పారు. ప్రపంచీకరణ పేరుతో పాలకులు తెగబడి పంచభూతాలను దోచుకుంటున్నారని విమర్శించారు. యజమానుల పట్ల కార్మికవర్గం ఉదారవాదంతో వ్యవహరించాలనే వితండ వాదనలు చేస్తున్నారని ఎద్దేవా చేశారు. ఆధునిక ఉత్పత్తి పరికరాలను చేతికిచ్చి 24 గంటలూ కార్మికుల శ్రమను పిండుకునే పద్ధతులను అనుసరిస్తున్నారని అన్నారు. ఇలాంటి దుర్మార్గమైన విధానాల ఫలితంగా పదేళ్ళ కాలంలో దేశంలోని పెట్టుబడిదారుల ఆస్తులు మూడురెట్లు పెరిగాయన్నారు. కాంగ్రెస్, బిజెపిలు పార్లమెంటు వేదికగా ఘర్షణ పడినట్లుగా నటిస్తూనే, ఆర్థిక బిల్లు ఆమోదం విషయంలో మాత్రం ఏకమయ్యాయని గుర్తుచేశారు. బంగారుతల్లి భ్రమలు, భూకంపాలు, పాదయాత్రలు ఎన్నటికీ పేదల పక్షం కాబోవని రాష్ట్ర రాజకీయ నేతల తీరును ఆయన ఆక్షేపించారు. ప్రపంచీకరణ సంధియుగంలో పాలకులు చేస్తున్న కొత్త తరహా దోపిడీ రూపాలను అర్థం చేసుకుని వారి బండారాన్ని ఎండగట్టాల్సిన అవసరముందని, ఆ దిశగా కవితా రచన సాగాలని కోరారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి నగర కార్యదర్శి జి. యాదగిరిరావు మేడే జనకవనం ప్రాముఖ్యతను వివరించారు. ప్రజానాయకుడు పుచ్చలపల్లి సుందరయ్య శత జయంతి, శ్రీశ్రీ జయంతి, ప్రపంచ కార్మిక దినోత్సవాన్ని పురస్కరించుకుని కవితా గోష్టిని నిర్వహించామన్నారు. సాహితీ స్రవంతి నగర కమిటీ సభ్యులు శాంతిశ్రీ జనకవనం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో సంయుక్త కార్యదర్శి తంగిరాల చక్రవర్తి, ఒబ్బిని సన్యాసిరావు, జంకెకృష్ణారెడ్డి, కొండపల్లి నీహారిణి, కొండూరి కాశీ విశ్వేశ్వరరావు, అనంతోజు మోహన్ కృష్ణ, శిష్టా మాధవి, ఆచార్య నరేంద్ర, గజెనెల్లి దశరథ రామయ్య, నడిమింటి లక్ష్మినారాయణ, టి. వెంకటి, కర్ల పాలెం భాస్కర్, ఎం. నారాయణశర్మ, సుతారపు వెంకట్, అల్వాల్ సురేష్, హరప్రసాద్, చేకూరి రామారావు, రత్న మహీధర్ తదితరులు పాల్గొన్నారు.

# కర్నూలులో శ్రీశ్రీ జయంతి



సాహితీ స్రవంతి కర్నూలు జిల్లా కమిటీ ఆధ్వర్యంలో ఏప్రిల్ 30న తేది మహాకవి శ్రీశ్రీ 104వ జయంతి వేడుకలను కర్నూలు నగరంలో ప్రజాశక్తి ఎడిషన్ కార్యాలయంలో, కోడుమూరులోని శ్రీ శ్రీనివాస ఇంగ్లీష్ మీడియం పాఠశాలలో జరిగాయి. ఎడిషన్ కార్యాలయంలో సర్క్యులేషన్ ఇన్‌ఛార్జ్ మురళీ అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో జిల్లా కార్యదర్శి కెంగార మోహన్, ఎడిషన్ మేనేజర్ వెంకటేష్, ఎడిషన్ ఇన్‌ఛార్జ్ పానుగంటి చంద్రయ్యలు పాల్గొన్నారు. శ్రీశ్రీ చిత్ర పటానికి చంద్రయ్య పూలమాల వేసి నివాళి అర్పించారు. అనంతరం జరిగిన సభలో మోహన్ మాట్లాడుతూ ఆధునిక సాహిత్యంలో తెలుగు కవిత్వాన్ని నడిపించి ప్రజలకు చేరువ చేసిన మహనీయుడని అన్నారు. ఆధునిక యుగంలో శతాబ్ది కవిగా, యుగకవి సాహితీ చరిత్రలో సుస్థిర స్థానం సంపాదించుకున్నాడని అన్నారు. పదండి ముందుకు పదండి తోసుకు పోదాం పోదాం పైపైకి అంటు సమసమాజాన్ని ఆధునిక తరానికి చూపించిన గొప్ప కవి శ్రీశ్రీ అన్నారు. చంద్రయ్య మాట్లాడుతూ కవిత్వాన్ని ప్రజాహితం చేసి, కార్మిక, కర్షక చమట చుక్కల్ని సిరా చుక్కలుగా మలుచుకొని అక్షరీకరించిన అరుదైన కవి శ్రీశ్రీ అని కొనియాడారు. వెంకటేష్ మాట్లాడుతూ ప్రస్తుత ప్రపంచీకరణ విధానాలకు వ్యతిరేకంగా ఆనాడే తిరుగుబాటు కవిత్వం రాసాడన్నారు. అభ్యుదయ కవిగా, విప్లవ కవిగా, ప్రజా కవిగా, భావ కవిగా బహుముఖీయ ప్రజ్ఞ కలిగిన సాహితీ సంపన్నుడు అని వివరించారు.

కోడుమూరులో జరిగిన శ్రీశ్రీ జయంతి వేడుకలకు సభాధ్యక్షులుగా సాహితీ స్రవంతి జిల్లా కమిటీ సభ్యులు మహ్మద్ షఫీ వ్యవహరించగా ముఖ్య అతిథిగా సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, వక్తలుగా ప్రముఖ రచయిత్రి ఎన్. నాగమణి, జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ పాల్గొన్నారు. జంధ్యాల రఘుబాబు మాట్లాడుతూ ప్రాపంచిక దృక్పథంతో కవిత్వాన్ని ప్రజాహితం చేసిన మహాకవి శ్రీశ్రీ అని అన్నారు. నేటి ఆధునిక కవులు ఎవరైన శ్రీశ్రీ కవితా మార్గ దర్శకత్వంలో నడవాల్సిన అవసరం ఎంతైనా ఉందని అన్నారు. ప్రపంచ సాహిత్యాల్ని అధ్యయనం చేసి, ప్రజా సాహిత్యాన్ని సృష్టించిన మహోన్నత కవి అని అభివర్ణించారు. కెంగార మోహన్ మాట్లాడుతూ నేటి కవులు శ్రీశ్రీ సాహిత్యాన్ని చదవకుండా కవిత్వం రాయలేరని మహా ప్రస్థానం వర్ధమాన కవులకు విశిష్ట ప్రామాణిక గ్రంథం అని అన్నారు.



ఏప్రిల్ 12న యస్. విజయకిషన్ రెడ్డి రచించిన "నీలి ముత్యాలు" కవితా సంపుటి ఆవిష్కరణ సభ. హైదరాబాద్‌లోని జూబ్లీహిల్స్ క్లబ్ హాలులో జరిగిన ఈ కార్యక్రమంలో ముదిగంటి సుజాతారెడ్డి, డి. కామేశ్వరి, జి. విజయాశేఖర్ రెడ్డి, యస్. కిషన్‌రెడ్డి, డి. రాజారెడ్డి, అరుణావ్యాస్, అమృతలత, రావు బాల సరస్వతి, కొండవీటి సత్యవతి విజయదుర్గ, కొండేపూడి నిర్మల శిలాలోలిత, ఏ.ఎస్.లక్ష్మి, పోల్కంపల్లి శాంతాదేవి, డా.సి. ఆనందారామం, కిరణ్ బాల, ఐనంపూడి శ్రీలక్ష్మి శంకర్, మేకారామస్వామి తదితరులు పాల్గొన్నారు.



ఏప్రిల్ 13న మల్లయ్య లింగంభవన్, గుంటూరులో "ప్రతిమాసం-రచనకోసం" కార్యక్రమంలో భాగంగా ఈ మాసం "వలస" అంశంపై నిర్వహించిన కవి సమ్మేళనంలో కవితా సమీక్ష చేస్తున్న డా॥ యం. లలితకుమారి. చిత్రంలో గుంటూరు జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకట సుబ్బయ్య, ముఖ్య అతిథి డా॥ రమణ యశస్వి సంఘం అధికార ప్రతినిధి ఎస్.ఎం.సుభాని ఉన్నారు



కవయిత్రి గురజాడ శుభాపేరిందేవి రచించిన ధిక్కార నానీలుకు కిన్నిగె డాట్ కామ్ వారు రూపొందించిన ఈ బుక్‌ను డా॥ ఎన్. గోపి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ ఎన్. గోపితో పాటు భవాని శంకర్ కవయిత్రి శోభ, కిన్నిగె అధినేత అనిల్ అట్లూరి, ఆరాధన వెంకటరెడ్డి, గురజాడ వెంకటలక్ష్మి ఉన్నారు.



ఏప్రిల్ 27న మచిలీపట్నంలో ఆంధ్ర సారస్వత సమితి వారి శ్రీ విజయనామ సంవత్సర 2013 ఉగాది సాహిత్య ప్రతిభా పురస్కారం స్వీకరిస్తున్న తంగిరాల చక్రవర్తి సమితి అధ్యక్షులు కొట్టి రామారావు, కార్యదర్శి జి. సనార, ఎల్.ఎస్. శాస్త్రి తదితరులు.



ఏప్రిల్ 21న నెల్లూరులోని ఆదిత్య డిగ్రీ కళాశాలలో పాతూరి అన్నపూర్ణ కవితా సంపుటి "హృదయాక్షరాలు" ఆవిష్కరణ సభ. చిత్రంలో నివాసకుమార్, రత్నప్రసాద్, పాతూరి అన్నపూర్ణ, కె. నాగేంద్రప్రసాద్, ఏ. జయప్రకాష్, శ్రీధర కృష్ణారెడ్డి, ఆచార్య ఆదిత్య, పి. విజయలక్ష్మి.



ఏప్రిల్ 28న అరసం (విశాఖశాఖా) ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య ఆధ్వర్యంలో విశాఖపట్నం పౌర గ్రంథాలయంలో కందుకూరి వీరేశలింగం 165వ జయంతి పురస్కారం అందుకున్న ఉద్యమకారిణి 'ఓల్గా' సభలో ఏ. విమల ఆచార్య చందు సుబ్బారావు అడపా రామకృష్ణ సత్యన్నారాయణ మూర్తి, పి. అనంతరావు పాల్గొన్నారు.



ఏప్రిల్ 13న సీనియర్ సిటిజన్స్ హాలు తెనాలిలో విశ్రాంత ఆచార్య డా॥ గుజ్జర్లమూజి కృపాచారి ద్వారా గుఱ్ఱం జాషువా ఉగాది పురస్కారం అందుకుంటున్న కవి బుర్రి కుమార్ రాజుచిత్రంలో ప్రముఖ కవి సాధనాల వెంకటస్వామి నాయుడు, ఎస్. మధు సూదనరావు, కొంతం నాగేశ్వరరావు తదితరులు వున్నారు



కథా సుగంధం ప్రారంభ సభలో ప్రసిద్ధ కవి ఆవంత్స సోమసుందర్‌ను సత్కరిస్తున్న విజయకృష్ణా ఫౌండేషన్ వ్యవస్థాపకులు డా. ఆలూరి విజయలక్ష్మి, ఆలూరి మురళీకృష్ణ, వేదగిరి రాంబాబు, చందు సుబ్బారావు, డా. పి. చిరంజీవినీ కుమారి, శశికాంత్ శాతకర్ణి, దంటు సూర్యారావు, అదృష్టదీపక్, వై.డి. రామారావు.



ఏప్రిల్ 3న హైదరాబాద్‌లోని త్యాగరాయ గానసభలో డా॥ ముక్తేవి భారతి మాతృమూర్తి 'వెలువలి అరవింద' స్మారక పురస్కారం అందుకుంటున్న డా॥ సి. భవానిదేవి.



ఇటీవల జరిగిన జిల్లా సాంస్కృతిక శాఖ ఉగాది వేడుకలలో శ్రీమతి వాయుగుండ్ల శశికళ రచించిన నానీల కవితా సంపుటి "స్వర్ణముఖీ సవ్వడులు"ను నెల్లురు జిల్లా కలెక్టర్ బి. శ్రీధర్ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో కవయిత్రి పాతూరి అన్నపూర్ణ, జె.సి లక్ష్మీకాంత్ తదితరులు.



ఏప్రిల్ 28న మచిలీపట్నంలో ఆంధ్రసారస్వత సమితి ఆధ్వర్యాన కవి రమణ వెలమకన్నిని ఉగాది 2013 సాహిత్య ప్రతిభా పురస్కారంతో సత్కరిస్తున్న బందరు మాజీ మున్సిపల్ ఛైర్మన్ బచ్చుల అర్జునుడు చిత్రంలో డా.బి. ధన్వంతరీ ఆచార్య మరియు యల్.యస్ శాస్త్రి ఉన్నారు.



ఏప్రిల్ 13న సీనియర్ సిటిజన్స్ హాలు తెనాలిలో విశ్రాంత ఆచార్య డా॥ గుజ్జర్ల మూడి కృపాచారి ద్వారా గుఱ్ఱం జాషువా ఉగాది పురస్కారం అందుకుంటున్న కవి ఎస్.ఎం.సుభాని- చిత్రంలో గుఱ్ఱం జాషువా కళా పీఠం అధ్యక్షులు పి. యేహోను, సాదనాల వెంకటస్వామి నాయుడు, ఎస్. మధు సూదనరావు, కొంతం నాగేశ్వరరావు, అయినాల మల్లేశ్వరరావు తదితరులున్నారు.

# అపురూప పురస్కారాలు



మే 12న జూబ్లీహిల్స్ క్లబ్‌హాల్‌లో జరిగిన అమృతలత & అపురూప అవార్డ్స్-2013 కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన పద్మ విభూషణ్ డా॥ అక్కినేని నాగేశ్వరరావు మాట్లాడుతూ జన్మనిచ్చినందుకు, జన్మను సుఖవంతం చేసినందుకు స్త్రీకి కృతజ్ఞతగా వుండాలంటాడో కవి. సృష్టిలో స్త్రీ, పురుషులు సమానమేనని, పురుషులు లేకుండా స్త్రీలు లేరని, స్త్రీలు లేకుండా పురుషులు లేరని, అమృత లత ముమ్ముందు సమర్థులైన పురుషులను కూడా సత్కరించాలని, యువత చెడు మార్గం పట్టకుండా మనం బాధ్యత వహించాలి, పాత్రల ద్వారా ప్రజలకు నీతి బోధించాలి. మంచిని ఆదరించడం, చెడును విస్మరించడం వ్యక్తుల కర్తవ్యం కావాలని చెప్పారు. విశిష్ట అతిథిగా విచ్చేసిన తొలి సినీ నేపథ్య గాయని రావు బాల సరస్వతీదేవి మాట్లాడుతూ వివిధ కళా రంగాల్లోని మహిళలను సముచితరీతిన సత్కరించడం సంతోషించదగ్గ విషయమని, ఈ కార్యక్రమానికి పూనుకొన్న అమృతలత వ్యక్తిత్వం గొప్పదన్నారు. అమృతలత అవార్డ్సు-2013 ప్రధానోత్సవం సందర్భంగా - ఒక్కొక్కరికి రూ॥ 25,116/- నగదు పురస్కారాన్ని అందజేశారు. కూచిపూడి నృత్యకారిణి పద్మశ్రీ డా॥ శోభానాయుడుకి, నవలా రచయిత్రుల డా॥ సి. ఆనందారామంకి, పోల్కంపల్లి శాంతాదేవికి అక్కినేని నాగేశ్వరరావు చేతుల మీదుగా అందజేశారు. అపురూప అవార్డ్స్-2013 ప్రధానోత్సవం పురస్కరించుకుని - ప్రముఖ చిత్రకారిణి యస్. వాణీదేవి, గాయని నిత్యసంతోషిణి, దూరదర్శన్ అనౌన్సర్ విజయదుర్గ భూమిక ఎడిటర్ కొండవీటి సత్యవతి, ఆంధ్రభూమి అసిస్టెంట్ ఎడిటర్ ఏ.ఎస్. లక్ష్మి, ప్రముఖ స్త్రీవాద కవయిత్రి కొండేపూడి నిర్మల, కథారచయిత్రి జాజుల గౌరి ఒక్కొక్కరు రూ॥ 10,116/- నగదు పురస్కారం అందుకున్నారు. విజయ్ గ్రూప్ ఆఫ్ ఎడ్యుకేషన్ ఇన్స్టిట్యూషన్స్ అధినేత్రి, రచయిత్రి అమృతలత మాట్లాడుతూ లలిత కళలనూ ముఖ్యంగా సాహిత్యాన్ని ప్రోత్సహించే దిశలో ఈ అవార్డ్సుని నెలకొల్పడం జరిగిందనీ, అవార్డ్స్ కోసం ఎవరూ ఎలాంటి అప్లికేషన్స్ పెట్టుకునే అవసరం లేకుండా - అర్హులైన వారి వద్దకే అవార్డులు చేరేలా న్యాయనిర్ణేతలను ఎంపిక చేయడం జరిగిందని తెలిపారు. ప్రముఖ పారిశ్రామికవేత్త యన్ కిషన్‌రెడ్డి ఈ కార్యక్రమాన్ని స్పాన్సర్‌చేసారు. ఈ అవార్డు ఉత్సవంలో ప్రముఖ రచయిత్రులు, ముదిగంటి సుజాతరెడ్డి, అరుణావ్యాస్, డి. కామేశ్వరి, శైలాజామిత్రతో బాటు అయినంపూడి శ్రీ లక్ష్మి, కిరణ్ బాల, రామస్వామి, ఎనిశెట్టి శంకర్, ఎన్. శ్రీనివాస్, కళాభిమానులు పాల్గొన్నారు. ఈ కార్యక్రమానికి ప్రముఖ రచయిత్రి, నెల్లుట్ల రమాదేవి వ్యాఖ్యాతగా వ్యవహరించారు. లంచ్ అనంతరం ఆహ్వానితులకు వినోదభరిత ఆటల పోటీలను నిర్వహించారు. ఆటల మధ్య చిన్నారులు తమ డ్యాన్సులతో ఆహూతులను అలరించారు. ఆద్యంతం ఆహ్లాదంగా, ఉత్సాహంగా సాగిన కార్యక్రమం తుర్లపాటి లక్ష్మి వందన సమర్పణంతో ముగిసింది.

## 'శాస్త్రదాస్యం' పుస్తకావిష్కరణ




ప్రకాశం జిల్లా ఒంగోలులో జిల్లా హేతువాద సంఘం ఆధ్వర్యంలో ఆదివారం ఏప్రిల్ 28న కళ్యాణి కాన్ఫరెన్స్ హాలులో కొప్పరపు సుబ్బారావు రచించిన 'శాస్త్రదాస్యం' పుస్తకం పునర్ముద్రణ ఆవిష్కరణ జరిగింది. పుస్తకాన్ని ఆవిష్కరించిన ప్రముఖ రచయిత విశ్రాంత అధ్యాపకురాలు డా॥ విజయబక్ష్ మాట్లాడుతూ రచయిత ఆనాటి సామాజిక సమస్యను తీసికొని అత్యంత సున్నితంగా ఆలోచింప చేసే ధోరణిలో ధైర్యంగ ఈ పుస్తకాన్ని రచించారని, స్వార్థ ప్రయోజనాల నిమిత్తం శాస్త్రాన్ని తమకనుకూలంగ అన్వయించుకోరాదని, ఏదైనా మార్పు కావాలని అనుకొన్నప్పటికి కొంత సంఘర్షణ తప్పదని అన్నారు. సభకు అధ్యక్షత వహించిన భారత హేతువాద సంఘ సహాయ కార్యదర్శి నార్నె వెంకట సుబ్బయ్య ఏ విషయాన్నైనా మూర్ఖత్వంతో ఆమోదించి, ఆచరించరాదని, హేతు దృక్పథం అలవరచుకోవాలని అన్నారు. అధ్యాపకుడు డా. బీరం సుందరరావు గ్రంథ సమీక్ష చేస్తూ సమాజంలో అభ్యుదయాన్ని ఆశించేవారు శాస్త్రదాస్యం లాంటి పుస్తకాన్ని చదవాలని, సమాజాన్ని చైతన్యవంతం చేయటంలో యిలాటి పుస్తకాల పాత్ర ఎంతో ఉందని అన్నాడు. ఇంకా ఈ కార్యక్రమంలో హేతువాదులు, పట్టణ ప్రముఖులు చుంచుశేషయ్య, ఎ. కొండలరాయుడు, టి. అరుణ, రాజ్యలక్ష్మి, సిద్ధార్థ బక్ష్ కుర్రా హనుమంతరావు తదితరులు పాల్గొన్నారు.

# ఆనందం - మహదానందం



రావూరి భరద్వాజ గారికి జ్ఞానపీఠ పురస్కారం లభించడం అమితానందాన్నీ, ఆశ్చర్యాన్నీ కూడ కలిగించింది. తెలుగు రచయితకెవ్వరికి ఆ పురస్కారం లభించినా తెలుగువారందరికీ ఆనందమే. భరద్వాజ గారికి రావడం మాత్రం ఆశ్చర్యకరం కూడా. ఆ ఆశ్చర్యం వారి సృజనాత్మకత, సాహితీ వైదుష్యాల గురించి కాదు. అలాంటి అవార్డులు రావడానికి వాటితో పాటు మరికొన్ని అదనపు అర్హతలు ఉండాలనేది సాధారణ అభిప్రాయం. భరద్వాజ గారిలో ఆ అదనపు అర్హతలు కనిపించవు. వారితో సన్నిహిత సంబంధం లేకపోయినా, కర్నూలులో జరిగిన ఒక సాహిత్య కార్యక్రమంలో వారిని చూడడం, వినడం జరిగింది. వారి ఆకారం మాట్లాడే విధానం, మాటల్లో ఆ నిర్మోహమాటం, ఆ నిజాయితీ, ఆ పారదర్శకత – అన్నీ కూడ నాకు బాగా ఇష్టమైన వ్యక్తులు – తిరుమల రామచంద్ర, కొడవటి గంటి కుటుంబరావ్, ముళ్ళపూడి వేంకటరమణ లాంటి వారికి చాలా దగ్గరగా ఉన్నట్టు అనిపించింది. జ్ఞానపీఠ పురస్కారం లభించాక వారిచ్చిన ఇంటర్వ్యూలలో కూడ అదే ధోరణి కన్పించింది.

ఇంతవరకు తెలుగుకు లభించిన జ్ఞానపీఠ పురస్కారాలు రెండు మాత్రమే. విశ్వనాథ సత్యనారాయణగారు, సి. నారాయణరెడ్డిగారు వైదుష్య ప్రతిభా పాటవాల్లో వారిరువురి సామర్థ్యం గురించి ఎవరికీ ఏ శంకా లేదు. వాటికి తోడు పైన పేర్కొన్న అదనపు అర్హతలు వారికి లభించాయి. విశ్వనాథ వారు పాతతరం స్వభావులేదైనా సాక్షాత్తూ పి.వి.నరసింహరావ్ గారే వారి వీరాభిమాని. ఇక నారాయణరెడ్డి గారి లౌకిక వ్యవహార ధురీణతకు ఎలాంటి ప్రశ్నార్థకాలూ అవసరం లేదు. వారిద్దరికీ ఆ అత్యున్నత పురస్కారం లభించడం తెలుగువారందరికీ గర్వకారణమే. అయితే ఆ వరుసలో అంతే యోగ్యత గల వారి జాబితా చాలా పెద్దదే. జాషువా, కరుణ శ్రీ, పుటపర్తి, ఆరుద్ర, దాశరథి, కొడవటి గంటి – వీరంతా దిగ్దంతులే. ఇక పురాణం సుబ్రహ్మణ్యశర్మ గారి భాషలో తెలుగులో నోబెల్ బహుమతి స్థాయి కథలు రచించిన బీనాదేవిగారు ఉన్నారు. చొక్కమైన కవిత్వం వ్రాసిన తిలక్, అజంతా ఉన్నారు.

అన్నింటి కంటే ఆశ్చర్యకరమైన మినహాయింపు మహా కవి శ్రీశ్రీ, జ్ఞానపీఠ పురస్కారాలు ప్రారంభం కావడానికి రెండు దశాబ్దాల ముందే మహాప్రస్థానం తెలుగు సాహితీ లోకాన్ని ఊర్రూతలూగించింది. ఆ పురస్కారం ప్రారంభమయ్యాక దాదాపు రెండు దశాబ్దాల కాలం శ్రీశ్రీ జీవించే ఉన్నారు. ఒక దశాబ్దాన్నే అంతగా చైతన్యపరచిన కవి బహుశ ఏ ఇతర భారతీయ భాషలోనూ ఉండరేమో! అలాంటి కవికి ఆ పురస్కారం లభించకపోవడం ఒక మహా వింత.

మరి అంత పారదర్శకంగా నిర్మోహమాటంగా మాట్లాడే, రచించే భరద్వాజగారికి ఈ పురస్కారం ఎలా లభించింది? ఈ అవార్డుల కమిటీలు అప్పుడప్పుడూ ఈలాంటి సాహసాలు చేసి ప్రజలకు ఝలక్ ఇస్తుంటాయి. ఇదీ అందులో భాగమై ఉంటుంది. హంపీ నుంచి హరప్పా దాక (తిరుమల రామచంద్ర స్వీయచరిత్ర), శతపత్రం (గడియారం రామకృష్ణ శర్మగారి ఆత్మకథ) గ్రంథాలకు కేంద్ర సాహిత్య అకాడమీ ఆ వార్డు (రెంటికీ పోస్త్యూమస్ గనే) లభించడం కూడా అలాంటి ఝలకే. "మేం మీరనుకున్నంత ఇంద్రియజ్ఞానం లేని జడులం కాదు స్మీ" అని నిరూపించుకోవడం బహుశ వారి అభిప్రాయం కావచ్చు. అందుకే అడపాదడపా ఇలాంటి గెంతులు గెంతి తమ జీవత్వాన్ని నిరూపించుకుంటారు. కొడవటి కుటుంబరావు గారు తమ 'తార' నవలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ అవార్డు లభించిన సందర్భంగా – "దీనిని బట్టి ఎంత మారుమూల చీకటి కోణాలలో నక్కినా, ప్రతిభను వెలికితీసే సత్తా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి ఉన్నదని గట్టిగా రుజువవుతున్నది" – అంటూ చేసిన వ్యాఖ్యల చమత్కారం అదే మరి.

ఇక ఈ సందర్భంగా మన రాష్ట్ర ప్రభుత్వ విజ్ఞత, ఔదార్యాలను కూడా ప్రత్యేకంగా ప్రశంసించాలి. ఒలింపిక్స్‌లు ఏదైనా ఒక ఈవెంట్‌లో ఒకే క్రీడాకారకు కాంస్య పతకం గెల్చినా సరే ఆ సంబంధిత రాష్ట్ర ప్రభుత్వాలు వెంటనే స్పందిస్తాయి. అరకోటి, కోటి నజరానాలు ప్రకటిస్తాయి. మరి 25 సంవత్సరాల విరామం తర్వాత ఇంత గొప్ప గౌరవాన్ని తెలుగు జాతికి సాధించిన భరద్వాజ గార్కి ప్రభుత్వం ఆలోచించాలోచించి ముందు రెండు లక్షలు ప్రకటించి, మళ్ళీ చివరి నిమిషానికి దాన్ని పది లక్షలకు పెంచి మరీ తన ఔదార్యాన్ని చాటుకుంది. బ్రేవో సర్కార్.

ఇవన్నీ ఏమైనా రావూరి భరద్వాజకి హృదయ పూర్వక అభివాదాలు. అంత శీఘ్రంగా స్పందించి వారి ముఖ చిత్రంలో, ఇంటర్వ్యూతో సంచికను వెలువరించిన సాహిత్య ప్రస్థానానికి అభినందనలు.

ఫ్రెండ్స్ పుల్లారెడ్డి, కర్నూలు
**9441373304**

# అక్షరపతాక

- వల్లభాపురం జనార్దన
9440163687

అతడు అక్షర పతాక
ఆకలితో బతుకు కాలుతున్నా
బూడిద కాకుండా
గుండె నిబ్బరాన్ని సిరాగా చేసుకొని
అక్షరాన్ని అగ్నిశిఖగా మండించి
తెలుగు సాహితీ ప్రపంచంలోకి
మట్టి వాసనతో ప్రవేశించిన మనిషి
గరళం బతుకును మింగుతున్నా
అమృత ప్రతిభావ్యుత్పత్తితో
అనితర సాధ్యంగా ఎదిగిన
ప్రాణవాయు ఖజానా.
ఆకలి-దరిద్రం-కన్నీళ్ళ
సవాళ్ళను ఢీ కొని
ఆలోచనల సుమాలను పూయిస్తూ
చెరగని చిరునవ్వుతో పలకరిస్తుంటాడు
తరగని వాస్తవాలను
ప్రతి నిధులుగా నిలబెడుతుంటాడు
అక్షరాలను గుర్రాలుగా పరుగెత్తించి
సాహితీ సృజన యుద్ధాన్ని గెలిచి
ఊరేగుతున్నా
నేలవాసనను మరిచిపోడు.
ఆకలి లావాకు అల్లాడిపోకుండా
దరిద్రం సంధిస్తున్న బాణాలకు
బెదిరిపోకుండా
కన్నీళ్ళ వరద ముంపుకు గురికాకుండా
జీవన సమరం చేసి
బతకడం కోసం
బతికించే సాహిత్యాన్ని సృష్టించి
పంకంలోంచి పుట్టిన పద్మమై
సాహిత్యారామాన్ని పరిమళింపజేశాడు
బతుకు సముద్రంలోకి
గజ ఈతగాడుగా దిగి
అగాధం అంతుచూసి
అక్షర రత్నాలను కుప్పవోశాడు
అవును. అవును. అతడు అక్షరపతాక.



# పురస్కారం

డా॥ ద్వా.నా. శాస్త్రి
9849293376

పురస్కారం అంటే
ఒక మెట్టు ఎక్కించేది
కృషిని వెన్నుతట్టేది
హృదయ కమలాన్ని వికసింపజేసేది
అది చాలాసార్లు
"అపాత్రదాన" మవుతుంది
ముక్కునవేసుకొనేది అవుతుంది
ప్రతిభకన్న ఇతరేతరశక్తులు
అధిపత్యం వహిస్తున్నా
అప్పుడప్పుడు 'అబ్రకదబ్రల'కి దూరంగా
దారితప్పి
తన పరువును కాపాడుకుంటుంది
ఎప్పుడో ఒకప్పుడైనా
అక్షరాన్ని శ్వాసించినవాడ్ని
వేదనను అక్షరీకరించినవాడ్ని
నిరాడంబర 'కలంకారీ'తనం గలవాడ్ని
వరించక తప్పదు
చెమటను చీదరించుకోనేవాడే అనూహ్యంగా
ఘర్మజల ఆరాధకుడ్ని అందలం ఎక్కించకతప్పదు !
అవి ఇప్పుడు పాకుడురాళ్ళు కావు - వజ్రపురాళ్ళు !
కొందరికి పురస్కారం - అహంకారపు కిరీటం
అసూయపు సింహాసనం
కానీ - అతనికి పురస్కారం అంటే -
పేదరికానికి పురస్కారం !
జీవన సమరానికి పురస్కారం !!
వినయమనీషికి పురస్కారం !
పురస్కారానికే పురస్కారం !!



Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitva Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

PRSVMORA 150

# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు



వెల: రూ. 150/-


వెల: రూ. 200/-



వెల: రూ. 50/-



వెల: రూ. 50/-



వెల: రూ. 30/-



వెల: రూ. 70/-



వెల: రూ. 20/-



వెల: రూ. 70/-



వెల: రూ. 15/-



వెల: రూ. 50/-



వెల: రూ. 50/-



వెల: రూ. 20/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ.100/-



వెల: రూ. 10/-



వెల: రూ. 40/-



వెల: రూ. 25/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVM02A150 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KDavceD |
| పేజీలు విడదీసినది | KDaveeD |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | No |
| పరిస్థితి | GOOD |